


చుట్ట తాగడము సనాతనమైన ఆచారమేనా, లేక ఈ యుగము వారు అలవరుచుకొనిన ఒక దురభ్యాసమా అని ప్రశ్న వచ్చింది.

పోర్చుగీసునావికుడు వాస్కోడిగామా మనదేశానికి పొగాకు తీసుకొని వచ్చినాడనీ, అంతకుముందు మనదేశవాసులకు పొగాకు సంగతి తెలియదనీ ఒక వదంతిమాత్రము ఉన్నది.

కాని ఈ విషయం అంగీకరించడానికి ఏమాత్రమూ వీలుపడదు. మన ప్రాచీన గ్రంథాలలో ఈ చుట్ట ప్రశంస వచ్చినది. కాబట్టి, చుట్టతాగడము చాలా ప్రాచీనమైన ఆచారముగా మనము అంగీకరించవలసి ఉంటుంది.

భీముడు చుట్టతాగేవాడని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పవచ్చును. భారతములోనే కావలసినంత సాక్ష్యము దొరుకుతుంది.

విరాటపర్వంలో అన్నాడూ "మొలచూపి పెక్కుచుట్టల్ పలుత్రాటంజుట్టి గోపభావం బమరన్" అని.

భీముడు తుణతుణానికి చుట్టుకోలేక చాలా పెద్దవైనవినీ, బరువైనవినీ అయిన చుట్టలు ఎక్కువగా ఒకేసారి చుట్టుకొని వాటిని చాలాత్రాళ్ళతో బిగించి, ఒకచోట పడేసి ఉంచుకొనేవాడు, కావలసినప్పుడల్లా ఒకటో రెండో తీసి కాల్చుకొనేందుకు.

'గోపభావం బమరన్' అని ఎందుకు అనవలసివచ్చిందీ అంటే.

.. పెనువ చుట్టలు చుట్టీ చుట్టీ ప్రాణం విసిగిపోయి, చివరకు తనమీద తనకే కోపం వచ్చింది అని చెప్పవచ్చు.

లేకపోతే ఇంకొక విధంగా చెప్పవచ్చు. పాండవులు అజ్ఞాతవాసంలో ఉన్నారు. వారంతా విరటుని కొలువులో ఉన్నారు. అప్పుడు తిరిక సమయంలో ఎప్పుడో భీముడు ఈ చుట్టలు చుట్టుకొని, 'మహారాజునై యుండికూడా ఎంతగతి పట్టింది నాకు; చుట్టలు చుట్టి ఇచ్చేందుకు ఒక్క సేవకుడైనా లేకపోయెనుగదా!' అని వాపోయినాడు అని చెప్పినా చెప్పవచ్చు.

సాహిత్యంలోనే ఇంకో నిదర్శనం చూపిస్తాను; చుట్టసంగతి మనవాళ్లకు తెలుసును అంటానికి.

"ఎంచిక నా గమనమునకు ఇంచుక చుట్టయిన కానిమ్ము" అని కళాపూర్ణోదయంలో ఉన్నది కళాపూర్ణోదయుడే ఈమాట అని ఉంటాడు. ఏమనీ అంటే, ఈ ప్రయాణంలో నాకు ఒక చుట్ట అయినాసరే ఇయ్యవలసిందీ, అని!

'చుట్ట అయినకాని, ఇమ్ము' అంటే ఒక చుట్టముక్క అయినా ఇయ్యవయ్యా అన్నమాట.

అంటే ఆ కళాపూర్ణోదయుడు చుట్టతరంకూడా తాగేవాడని ప్రాకరణికార్థం. అది ఏదో మనము ఇప్పుడు ఊహించలేము.

ధర్మరాజు ఒకసారి ఏదో ప్రసంగంలో చుట్ట అంటే ఎవరికీ కోపం రాకూడదు అని చెబుతూ, "చుట్టయును పగయును భేదం బెట్టి జనులకు తగదు" అన్నాడు. చుట్ట త్రాగేవాడు కాకపోతే దానిని అంతగా పెనకేసుకురాడు.

కాటూరు వెంకటేశ్వరరావుగారు పడుకొనేబోయేముందు రెండు మూడు చుట్టలు చుట్టుకొని, పక్కనున్న బల్లపై పెట్టుకొని నిద్రపోయేవారు. "పడుకోబోతూ ఉంటిరి. ఇప్పుడు తాగరుకదా! ఎందుకండీ చుట్టలు చుట్టుకొన్నారూ?" అని అడిగాను.

"రేపు ప్రొద్దున నిద్ర లేవడముతోనే కావాలయ్యా. అప్పుడు చుట్టుకోటం అంటే బద్ధకంగా ఉంటుంది. అందుకని ఇప్పుడే చుట్టలు చుట్టుకొని పరుంటాను.

"భూభారాన్ని మోసే ఆదిశేషుకూడా ఇల్లాగే చేసేవాడట. 'చుట్ట చుట్టుకొని పరుండె' అని భాగవతంలో ఉన్నది" అన్నారు.

విష్ణుమూర్తికి 'చుట్టవాలుజోదు' అని పేరు ఎందుకు ఉన్నది, అని అడిగితే ఏమి సమాధానం చెపులారు? ఏదో పోనీలే అని ఊరుకుంటూ ఉన్నా కాబట్టి సరిపోయింది కాని! అసలు చుట్టతో ఆయనకు ఏమి సంబంధం? ఎందుకు గ్రంథంలోకి దిగడము! ఆయన చుట్ట తాగేవాడని తెగేసి చెప్పి ఊరుకుంటాను

అయితే శ్రీవిష్ణు పాదారవింద సేవకులూ శ్రీ ఏడుకొండల వేంకటరమణుని భక్తులూ మొదలైనవారిచే త్రాగబడే చుట్టలను తిరుచుట్టలు అని పేరు. మనము తాగేవి మామూలు చుట్టలు. అంతే భేదం.

కాబట్టి భారతకాలం నాటికే చుట్ట త్రాగే అలవాటు మనకు ఉన్నట్లు తేలిపోయింది.

మరొక్క విషయము కూడా తెలుస్తున్నది. గురుజనుల సమక్షంలోనూ, స్త్రీల ఎదుటా చుట్ట తాగేవారు కారని భారతంలో ఉన్నది.

ఎక్కడ ఉన్నదీ అనవచ్చు. త్రాగవచ్చునని ఎక్కడ ఉన్నది? త్రాగవచ్చునని లేదు కాబట్టి, త్రాగకూడదు అనే ఉన్నట్లు మనము విధిగా భావించవలె. ప్రతిపక్షులకు అనుకూలదృష్టాంతము లేనపుడూ, మనము చెప్పినదానికి దృష్టాంత విరోధము లేనపుడూ స్వపక్షస్థాపన జరిగినట్లే భావించుట తర్కసమ్మతము. ఇతి తర్కః.

స్త్రీల సమక్షంలో చుట్ట తాగడము నిషేధమే అయినప్పటికీ, ప్రియురాలితో ఏకాంతంగా ఉన్న సమయంలో చుట్ట తాగడము ఆనుపూర్వికసంప్రదాయముగా కనిపిస్తుంది.

భార్య ప్రియునిదగ్గరకుచేరి తములపాకుల

'చుట్టలు' ఇచ్చినట్లు అనేకచోట్ల వర్ణితము. పాండురంగ మాహాత్మ్యంలో ఈ విషయము స్పష్టంగా చెప్పినాడు "తనదు తోయ్యలి, విడ్యము చుట్టయీగన్" అని ఉన్నది భార్యభర్తలు తమలపాకులూ, చుట్టా కూడా, ఇచ్చినట్లు చెప్పబడి ఉన్నది

బంధువులు, స్నేహితులు వచ్చినపుడు భోజనానంతరం అందరికీ తలోక చుట్ట ఇయ్యడము ఇప్పటికీ మనలో ఆచారంగా ఉన్నది

ఈ ఆచారము భారత కాలంనాటికే ఉన్నదని ఊహించడానికి ఆధారాలు దొరుకుతున్నవి

శ్రీకృష్ణ భగవత్పాదులవారి ఇంటికి బంధుజనులంతా వచ్చినారు ఆ వచ్చినవారిలో పాండురాజు తనయులూ, ధృతరాష్ట్రుని కుమారులూ కూడా ఉన్నారు

శ్రీకృష్ణుడు మొదటినుంచీ పాండవుల యందు స్నేహభావంతో ఉంటూ, ఆదరణ చూపిస్తూ, పక్షపాతం ప్రకటిస్తూ ఉండినాడు

ఒక సందర్భంలో చుట్టలు ఈయడములో కూడా ఈ పక్షపాతమే ప్రదర్శించి, పాండుతనయులకు తలోక చుట్ట ఇచ్చి, ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు

అల్లాగ పక్షపాతంతో ప్రవర్తించడానికి కారణము ఊహించడమూ కష్టముకాదు పొగాకు ఆ రోజులలో చాలా ప్రియంగా ఉండి సర్వజన లభ్యంగా ఉండేదికాదు మహారాజులు మాత్రమే చుట్ట తాగేవారు

పాండువులు అయిదుగురు ఆ అయిదుగురికి అయిగు చుట్టలు ఇయ్యడము అంత కష్టమైన పనికాదు

ధార్తరాష్ట్రులు నూర్గురు అంతమందికీ చుట్టలు ఇయ్యడము కష్టం

ఈ కారణముచేతనో, లేక పాండవ పక్షపాతి కావడముచేతనో శ్రీకృష్ణభగవానులు పాండవులకు మాత్రము చుట్టలు ఇచ్చి, ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు

అప్పుడు భీష్మాచార్యుడో కృపాచార్యుడో అంటాడూ: "పాండవులు ధార్తరాష్ట్రులు పుండరీక నేత్ర చుట్టరికంబున నీకు నొక్కరూప" అంటాడు

'ఓ మహానుభావా, కృష్ణా, పాండవులు, ధార్తరాష్ట్రులు అనే భేదం ఉండకూడదు చుట్టరికంబున అనగా చుట్టలు పంచియిచ్చేవిషయంలో అందరూ నీకు ఒక్కరూప, అందరూ సమానులే సుమా' అంటున్నారు ఆ ఆచార్యులవారు చుట్టకు సంబంధించిన శ్లేషామే చుట్టరికమని ముందు నిరూపిస్తాను

ఆచార్యులవారితో సంబంధం ఉన్నది కాబట్టి అవి తిరుచుట్టలే అయిఉంటవి

చుట్టతాగడము ప్రధానంగా రాజులపరంగానే కనబడుతుందిగాని సామాన్యులవిష

# రచయితలకు మనవి

ఇటీవల కొందరు రచయితలు ఇదివరలో అచ్చయిన తమ రచనలను క్రొత్త రచనలన్నట్లు ఇప్పుడు తిరిగి మాకు పంపడం, కొందరు ఇతరుల రచనలను అన్యభాషలలోనుంచీ, తెలుగులోనుంచీ సంగ్రహించి స్వతంత్ర రచనలుగా పంపడం జరుగుతున్నది వీరు సోదర రచయితలకు, మాకు జరుగుతున్న అపచారాన్ని గుర్తించడంలేదు మాకు వచ్చే రచనలను, అనుమానంతో పరిశీలించడం రచయితలకుగాని మాకుగాని గౌరవప్రదం కాదని గుర్తించవలసిందిగా వీరిని ప్రార్థిస్తున్నాము ఇందువల్ల చిక్కులకు లోనుకావచ్చునని ఇట్టివారు గ్రహించడంమేలు ఇదివరలో మా పత్రికలోగాని, ఇతర పత్రికలలోగాని ప్రచురించబడిన వేలాది రచనలను చదివి జ్ఞప్తిలో ఉంచుకోడం ఏ సంపాదకునికైనా అసాధ్యమైన విషయమని ప్రత్యేకం చెప్పనవసరంలేదు

అన్యథా సూచించినప్పుడు తప్ప, మాకు వచ్చే రచనలు మొదలైనవి, పంపినవారి స్వతంత్ర రచనలేననే, భావంతోనే మేము ప్రచురించడం జరుగుతుందని అందరూ గుర్తించ ప్రార్థన

## మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలనుకూడా గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని తిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి నెగటివ్‌లు స్వీకరించబడవు

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి రంగుల చిత్రాలు స్వీకరించబడవు

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం

నిరాకరించబడిన రచనలను తిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము

—సంపాదకుడు

# "ఉదయ కిరణాలు"

## నవలా రచన పోటీలో బహుమతి పొందిన నవల

### కర్త: శ్రీ పోతుకూచి సాంబశివరావు, హైదరాబాద్.

### మే 25 వ తేదీ సంచికలో ప్రచురణ ప్రారంభం



ఈ యేడాది ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రిక జరిపిన నవలా రచన పోటీలో రు 250/. బహుమతి పొందిన నవల 'ఉదయ కిరణాలు" ప్రచురణ మే 25 వ తేదీ వారపత్రికలో ప్రారంభమౌతుందని మా పాఠకులకు తెలియపరచడానికి ఆనందిస్తున్నాము.

—సంపాదకుడు.

ఇట్లాగ ఉంటుంది "ఎక్కడ ధూమము ఉన్నదో అక్కడ అగ్ని ఉన్నది. ఇక్కడ ధూమము ఉన్నది, కాబట్టి ఇక్కడ అగ్ని ఉన్నది" ఈవాదననే ఇంగ్లీషులో సిలోజిజమ్ అంటారు.

ఈరకము వాదనకు ప్రాణం వాచ్యోపాయబడిన విచిత్రతర్కం మాడనగును "ఎక్కడెక్కడ ధూమము ఉన్నదో అక్కడక్కడల్లా అగ్ని ఉన్నది" అన్నది హేతువాక్యము.

ఆ హేతువాక్యమే దోష యుక్తము అయితే వాదము దోషభూయిష్ఠము అవుతుంది హేతునిర్ణయము చేయడంలోనే తార్కికుని ప్రతిభ ప్రదర్శితము అవుతుంది.

అందుచేత తార్కికులు హేతుపుష్టి కోసమూ వైయాకరణి ధాతుపుష్టికోరకూ చూస్తూ ఉంటారు.

ఆసంగతి అట్లాగ ఉంచి ప్రకృతానికి వద్దాము.

ఇప్పుడు పైన చెప్పినవాదనలో హేతు పుష్టి ఉన్నది. ఎందుచేతనూ అంటే పొగ ఉన్నచోటల్లా అగ్ని ఉంటుందీ అన్న విషయాన్ని కాదని ఎవరూ అనలేరు

కొంచెము తార్కిక పరిభాషలోకి దిగితే, ధూమానికి, అగ్నికీ, నియత సంబంధము ఉన్నది అని అంటారు. ఆ రెండూ ఎప్పుడూ కలిసిఉంటవి. పొగ ఉన్నదీ అంటే, అగ్ని ఉన్నదన్నమాటే, అందుకనే 'యత్ర యత్ర ధూమః తత్ర తత్ర అగ్నిః' అని చెప్పారు శాస్త్రకారులు

పై హేతువాక్యాన్ని తార్కికుడు ఎట్లా నిర్మించగలిగినాడు? అని ప్రశ్న "చుట్ట తాగడాన్ని చూసి!" అని జవాబు వచ్చినట్లు చెప్ప తీరాలె! ఇంకోమార్గం లేదు!

ఎందుకంటే ఆ నియత సంబంధం ఒక్క ఈ విషయంలోనే అనుమానానికి అవకాశం లేని పద్ధతిలో కనిపిస్తుంది. చుటలో అగ్ని ఉంటే నోట్లోనుంచి ధూమము వస్తుంది అగ్ని లేకపోతే ధూమం రాదు. యత్ర యత్ర వహ్నిర్నాస్తి తత్ర తత్ర ధూమోఽపినాస్తి

అయితే "చుట్ట కాల్చుచుండగా ధూమము వచ్చుటయూ అచ్చట అగ్నియు ధూమమును కలిసియుండుటయూ, మేము చూచితిమి" అని ఈ తార్కికులు ఒప్పుకోరు ఒప్పుకోక 'యత్ర ధూమస్తత్రాగ్నిః, యథా మహానసః' అంటారు. ధూమమూ అగ్నీ వంటయింటియందు నియత సంబంధముతో ఉన్నవి అని అన్వయ దృష్టాంతము ఇస్తారు.

ఇట్లాగ అనడము చుట్టయందు కేవల వ్యతిరేక భావము ఉండడమువల్లనే గాని మరొకటి కాదు. చుట్టకు ఈ విధంగా అన్యాయం జరిగింది తార్కికుల చేతులలో.

ఈ కారణము చేతనే ఈనాటికీ తర్కం చదువుకొన్నవారి చేతిలో చుట్ట ఉంటే కాలదు అందుకనే వాళ్లు చుట్ట తాగరు. ఈ విషయం నిజమో అబద్ధమో తెలుసుకోవలెనంటే జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారిని, తిరువెంగళాచార్యులు గారిని అడుగవచ్చు.

నిజానికి ధూమానికి, అగ్నికి ఏకాంతిక సంబంధం మహానసములో చూస్తే కుదరదు. అక్కడ సంగతి మా కాంతాన్ని అడిగాను, "ఏమిటి నిజం సంగతి చెప్పు; ధూమము ఉన్నచోట్లనెల్లా అగ్ని ఉంటుంది అంటాడు న్యాయదర్శన గ్రంథకర్త. అది నిజమేనా!" అని

తర్కశాస్త్రం రచించిన గౌతముడే కాని ఆ గ్రంథాన్ని తెలిగించిన వెంకటరమణశాస్త్రిగారే గానీ ఎవరైనా సరే, ఈ ధూమాగ్నుల మధ్య ఉన్న సంబంధం విషయంలో కాంతం చెప్పినదానికి కట్టిక్కన తల వంచవలసిందే గాని కాదంటానికి వీలు లేదు ఈ విషయంలో ఆమె నిర్ణయము ప్రమాణవాక్యము. దానికి విప్రతిపత్తి లేదు కాబట్టి ఆమెవాక్యం సర్వతంత్రసిద్ధాంతముగా, అనగా ఇతరశాస్త్రములకు వైరుధ్యంబులేనిదానినిగా అంగీకరింపక తప్పదు.

"అనేకసార్లు ఊరికే పొగరాజుతుందే గాని నిప్పు రాజదు. ఎప్పుడైతే నిప్పురాజి అగ్ని ఏర్పడుతుందో అప్పుడు పొగఉండదు" అని ఆమెగారు తేగేసి చెప్పింది.



# చుట్ట



మహానసములో ధూమాగ్నులకు, నియత సంబంధం లేదు. ఒక్క చుట్ట కాలుస్తున్నప్పుడే ఎఱ్ఱని నిప్పూ, పొగా కలిసి ఉంటవి.

కాబట్టి యత్రయత్ర ధూమః తత్రతత్ర అగ్నిః అన్న వాక్యం చుట్ట దహనసంస్కారాన్ని చూచే అనబడ్డది.

గౌతముని కాలం నాటికి చుట్ట కాల్చడము మిక్కిలి వ్యాప్తిలో ఉండవలె.

అభ్యుదయ రచయితలు అన్నట్లు ఆ కాలంలో రాజులను సంతోష పెట్టడానికే సకల శాస్త్రములూ, కావ్యాలు పుట్టినవి కాబట్టి, రాజులు చుట్టకాల్చడానికి సంబంధించిన ఈ వాక్యం తర్కశాస్త్రంలోకి ఎక్కింది.

కాబట్టి ఇంతకూ తేలిన విషయము ఏమిటీ అంటే, చుట్ట పంఖినీమీదే తర్కశాస్త్రం పుట్టింది అని!

ఉదాహరణలో మహానసములోవలె అని చెపుతారు తార్కికులు. అల్లాఅనక యత్ర యత్ర ధూమస్తత్రాగ్నిః యథా, చుట్ట దహనసంస్కార వైఖరీః అని ఉండాలిసింది.

సాధర్మ్యనిరూపణ ఇల్లాగ చుట్టకు సంబంధంగా ఉండకపోవడానికి కారణముకూడా మనము ఊహించవచ్చు. మొదట్లో రాజులకు సంబంధించిన ఆచారాన్ని తర్కశాస్త్రంలోకి ఎక్కించారు. కాని తరువాత రాజుల ప్రతిభ తగ్గింది. బ్రాహ్మణుల ప్రాబల్యం వచ్చింది. చుట్ట త్రాగడము రాజులలో ఉండేదని చెప్పాను. వారు క్షత్రియులు. అనగా బ్రాహ్మణేతరులు. బ్రాహ్మణేతరుల ఆచారాన్ని పేర్కొని, దానికి తర్కశాస్త్రంలో ప్రాధాన్యము ఇయ్యవము, తర్కశాస్త్ర గ్రంథకర్తలైన బ్రాహ్మణులకు ఇష్టం లేకపోయివుంటుంది. అందుకనే తమకు ఇష్టమైన మహానస విషయము ఉదాహరణగా చేర్చినారు.

బ్రాహ్మణులవలన బ్రాహ్మణేతరులకు జరిగిన అన్యాయాలలో ఇది యొకటి.

ఇక అలంకారశాస్త్రంలో చుట్టకు కావలసినంత ప్రమేయము ఉన్నది. అదిప్పుడు తేలే విషయం కాదు. సంస్కృత వాఙ్మయంలో చుట్ట ప్రశంస కొద్దిగా ఉన్నదని చూపిస్తాను. కాళిదాసు మేఘసందేశంలో మేఘములు చుట్టలతో పోల్చబడినవి. మేఘములు చుట్టలుచుట్టుకొని వగనమార్గాన సంచరిస్తున్నవట!

ధూమజ్యోతి స్సలిలమరుతాం అన్నచోట ధూమప్రశంస వచ్చింది. కాబట్టి కాళిదాసుకు చుట్ట తాగడమూ, దానివలన పొగను పుట్టించడము అనే విషయాలు తెలిసే ఉండాలె.

చుట్ట తాగడములో రెండు విశిష్టమైన పద్ధతులున్నవి. దక్కని ఒక పేటికలో కొన్ని చుట్టలను పేర్చి దానినీ, ఒక నిప్పు పెట్టెనూ, పక్కనున్న గుండ్రని బల్లపై పెట్టి, ఒక పడక కుర్చీలో శయనించి ఠీవిగా చుట్టను ముట్టించి, ఆప్యాయంగా ధూమపానం చేయడము ఒక పద్ధతి. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఈ పద్ధతిలో చుట్ట కాలుస్తారు

అరుగుపైనగాని లేక మరొకచోటగాని చాపపై సద్దిగంవేసి కూర్చుని చుట్ట తాగడము మరొక పద్ధతి. కాటూరువారు ఈ పద్ధతిలో చుట్ట తాగుతారు.

ఈ రెండవ పద్ధతిలోకూడా ఠీవి, రాజసము హుందాతనము సరళత, స్నేహభావమూ, రాజభూయము మొదలైన సుగుణాలు ప్రదర్శితము కావడానికి అవకాశాలు ఉన్నవి.

చక్రవాకములు సూర్యునియందు, చకోరికలు చంద్రునియందు, తుమ్మెదలు పువ్వుల గుత్తియందు ఎల్లాంటి అనురక్తికలిగిఉన్నవో అలాగే కవులుకూడా కాటూరివారి చుట్ట తాగేపద్ధతియందుఅనురక్తినికలిగియున్నారు.

చుట్టా, బీడీ, సిగరెట్టు అనేవి ఉపాధి భేదంచేత వేరువేరు వస్తువులుగా కనపడుతూ ఉన్నప్పటికీ, వానిలో ఉపహితమైయున్న మూలపదార్థము ఒక్కటే.

ఒకటే పరమాత్మ పదార్థము త్రిమూర్త్యాకారమును పొందినట్లే, ఇదీనూ.

ఈ మహదర్థమును ఎఱిగిన కారణాన పండితులూ కవులూ అయినవారు ఈ త్రిమూర్తులనూ సేవిస్తూ ఉంటారు.

ఎట్లాగయినా ఈ త్రికములో పర్వతాలలో మేరువువలె శిఖరాలలో, కైలాసములాగ, సముద్రాలలో క్షీరసముద్రమురీతి, యశోవైభవముకలిగి జగద్వ్యాపకమైనకీర్తిని కలిగియున్నది ఒక్క చుట్ట అనే చెప్పవలసి వస్తుంది.

చుట్ట తాగడమువలన అనేకప్రయోజనములు సిద్ధిస్తూఉన్నవి. రాజకీయాలలో శేముషీధురంధరుడైన చర్చిల్ చుట్ట త్రాగడమువల్లనే అసమానమైన ప్రజ్ఞను సంపాదించినట్లు జగద్విదితము.

దేవులపల్లి, కాటూరి ప్రభృతులు చుట్ట తాగుతూఉన్న కారణానే, మహాకవులైనట్లు మనము ఊహించవచ్చును.

చుట్టను ముట్టించి విలాసంగా పొగను వదలి, వర్తులాకారమైన చిన్నచిన్న మేఘమండలాన్ని సృష్టించగా అవి మందమంద గతిని ఆకాశంలో విహరిస్తూఉంటే, పంక్తులుగా నిలచిన బలాకములవలెనూ, బిసకిసలయముల 'సపాథేయు'గా గొని మేఘుని వెంట కైలాసమునకైపోవుచున్న రాజహంసలవలెను కనిపిస్తవి.

అదీకాక, ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయందదర్శ, అనే శ్లోకపాదంకూడా జ్ఞాపకం వస్తుంది.

చుట్ట మనస్సుకు కలిగిన వ్యాకులతను పోగొడుతుంది అలసటను తీరుస్తుంది. దాహాన్ని ఉపశమింపజేస్తుంది. విరహార్తులను శమింపజేస్తుంది.

చుట్ట తాగడమువలన కలిగే ఆనందము, మధురమైన కావ్యమును చదివినపుడూ, ప్రియురాలు చెంపపై చిటిక వేసి సరసోక్తులు ఆడేటప్పుడూ కలిగే ఆనందముతో సమానమైనది అని చెప్పవచ్చును

కోపము ద్వేషము మొదలైన మనోవికారాలను పోగొట్టటానికి చుట్టవంటి వస్తువు ఇంకొకటి లేదు.

మిత్రునివలె ఆదరించేది, ప్రియురాలివలె లాలించేది, తల్లివలె బుజ్జగించేది ఒక్క చుట్టే కాని మరొకటి కాదు.

ఈ వ్యాపారము ఒక్కటే పీయూషపానమువలె మధురమైనదీ, శరద్రాత్రివలె మనోహరమైనదీ అయిఉన్నది.

కాబట్టి మనము అందరమూ కూడా ఈ చుట్టకు ప్రణత శిరస్కులము కాకతప్పదు.

చుట్టయొక్క మాహాత్మ్యమునూ, పరువమునూ, ప్రయోజనమును గుర్తింపని కొందరు నాస్తికులు, దానినిగురించి అపభాషణ చేస్తూఉండటము చాలా శోచనీయము.

హే చుట్టే, అహంత్వాం ఉపాసే తమసోమాజ్యోతిర్గమయ.






మునిమాణిక్యం నరసింహారావు, బి. ఏ., ఎల్. టి.,

౧

**కా**పరానికి వచ్చింది మొదలు ఇంతవరకూ ఒక్కసారయినా మా ఆవిడ ప్రణయ కోపం అభినయించలేదు. ఆమాట నేను కావ్యాలలో చదవటం తరుచూ వినటం మూలాన మా ఆవిడచేత ప్రణయకోపం పట్టించాలని బహు సరదాగా ఉంటూ ఉండేది. అడపా దడపా నేను "ఏం కాంతం, నీవు ఒక్కసారైనా ప్రణయకోపం పట్టావు కావు" అని అంటూంటే ఆవిడ "ఎప్పుడో ఒకప్పుడు పడతా లెండి ఇప్పుడే తొందరొచ్చింది" అని అంటూ ఉండటం మూలాన రోజులు గడిచి పోయినైయి. అంతేకాని పట్టుపని కూర్చుని శాస్త్రియుక్తంగా ఒక్కరోజైనా ప్రణయ కలహం జరిగించలేదు.

అనుకోటమే కాని శాస్త్రోక్తమైన ప్రణయ కలహం ఎట్లా జరపాలో నాకూ తెలియదు. నిజంమాటకు! ఆడదాన్ని చేసి ఆవిడను ఒక్కదాన్ని పట్టమంటే ఏంపడుతుంది పాపం! అందుకని వాత్స్యాయన కామసూత్రాలు సంపాదించి ప్రణయ కలహ విధానాన్ని గూర్చి అసాంత్రము చదివాను. కోస్త కూస్త విషయంగాదది. సత్యనారాయణ వ్రతానికి చేయాలిసినంత పని ఉంది.

నాయకుడు పూర్వాహ్ణమందు భోజనమయిన తరువాత చిలుకలను, గోరువంకలను మాట్లాడించాలట! మా పేటలకు చుట్టూ పర్ర భూములవటంవల్ల, చుట్టుపక్కల ఎటు చూచినా మైలు మైలున్నర, దూరంలో, చిలుకలు గోరువంకలు కనిపించవు.

శాస్త్రకారుడు విధించిన నియమాన్ని వదిలేయటం నాకేమాత్రం మనస్కరించలేదు. ఎంత కష్టమైనా సరే, శాస్త్రియుక్తంగా ప్రణయ కలహం నిర్వహించాలనుకొన్నాను. ఏదో పెద్ద వాళ్ళమై పోతున్నాము. ఇక మళ్ళీ పట్టచ్చామా! అందుకని శీరంగికి భోజనమైన తరువాత మా ఆవిడ ఈ ఎండలో ఎక్కడికి పోతారు, వద్దు, అంటుంటే కూడా వినకుండా, నెత్తిని గుడ్డవేసుకొని, నాలుగు మైళ్ళ దూరంలో నున్న కరి మీదికెళ్ళి తోటల్లో తిరిగి, ఎట్లాగైతే నేమి చిలుకలను గోరువంకలను మాట్లాడించి సాయంత్రానికి ఇంటికి చేరుకున్నాను.

అటు తరువాత జరుగవలసిన కార్య క్రమాన్ని గురించి విచారించాను. తదంతే.....సంమార్జన, పుష్ప ప్రకరము, శయన రచనము.........ఇవి జరగాలిసినవి.

ఇవన్నీ ఒక్కొక్కటే క్రమంగా చేసుకొచ్చాను. అందులో శయన గృహము సంచారిత సురభి ధూపములు కల్గు దానిగా ఒనర్చవలయునన్న నియమాన్ని అనుసరించి, అర్ధణా ఊదొత్తులు కొని ఉంచాను.

రాత్రి భోజనానికి కూర్చునప్పుడే ఈ ప్రణయ కలహ విధానాన్ని గూర్చి అంతా ఆవిడకు తెలియజెప్పి, అద్దాన్ని జయప్రదంగా సాగించమని చెపుదామని అనుకొన్నాను కాని, "ప్రత్త"కు అనగా వివాహము చేయబడిన స్త్రీకి కామశాస్త్రగ్రహణాధికారము లేదు. అంచేత మాట్లాడక ఊరుకొన్నాను.

ఒకటి రెండుసార్లు కాంతం "ఏమిటండీ భోజనం చేసేటప్పుడు కూడా ఒకటే ఆలోచన" అని అన్నది కాని నేను మాట్లాడలేదు.

ఇక శయన రచన చెయ్యాలి. పుస్తకం తెరిచి బల్ల మీద పెట్టుకొని ఒక్కొక్క విషయమే చదవటం, ఆ ప్రకారం చెయ్యటం!

శయన మందిరము "ఖట్వాశ్రయ ప్రతిపాదికాస్తరణ తూలికామలతో ఒప్పియున్నదై యుండా"లన్నాడు. ఆ వాక్యంలో ఒక్క ముక్క నా కర్థం కాలేదు. దగ్గరలో ఎవ్వరూ సంస్కృతం చదువుకొన్నవాళ్లు లేరు. సరే ఏం జేసేదీ? ఆ విషయం వదిలేశాను.

హంసతూలికా తల్పముపైన శయనరచన చేయాలె. మా హంసతూలికా తల్పము—అంటే మా మామూలు పట్టె మంచంపైనే తెల్లటి దుప్పటి ఒకటి పరిచాను.

ఇక శిరోభాగే కూర్చస్థానమ్—అని ఉంది. మొదట సరిగ్గా అర్థం గాలేదు. "కూర్చ" అన్నమాట ఎక్కడో విన్నట్లు జ్ఞాపకం. ప్రణహ కలహంలో కూర్చ ఎందుకబ్బా అనికొని క్రిందవ్రాసిన టీకలో చూద్దును కదా. ప్రాణం తేలొచ్చింది. కూర్చస్థానమ్ అంటే కుర్చీట! బతికించాడు బంగారు తండ్రి శాస్త్రికారుడు. సరిగ్గా మా హంసతూలికా తల్పానికి శిరోభాగంలోనే ఉంది పేము కుర్చీ. ఇప్పటికి శయనరచన పూర్తి అయింది.

తరువాత శయనమందిరాన్ని అలంకరించమన్నాడు. ఒక వేదిక ఉండాలట! పాపం ఆ కాలంలో బల్లలు లేవు కామాలు, వేదిక అన్నాడు. మాకేం కర్మం మా గదిలో మంచి టేబిల్ ఉంది.

నిపోళావ గుంరితమైన వీణ, చిత్రఫలకం, పుస్తకం, పూలమాలలూ, ఉండాలట! అయితే వీణకు బదులు మా అమ్మాయి ఫిడేలుంది. చిత్రఫలకం లేకపోయినా, చిత్రపటాలున్నాయి. "పుస్తకం" అన్నాడు. ఒక పుస్తకమేమి కర్మం! ఒక వంద పుస్తకాలు, కాంపోజిషన్ పుస్తకాలతో కలుపుకొని ఉన్నాయి మా గదిలో!

ఇంక ఒక అరగంటలో కాంతం ఇల్లు సద్దుకొని వస్తుంది. నేను కుర్చీలో కూర్చుని ప్రణయకలహ విధానాన్ని గురించి మరోమారు పఠించి ముఖ్య విషయాలను అనుక్రమణికగా కాగితంమీద వ్రాసుకొన్నాను.

ప్రణయ కలహంలో ప్రథమ ఘట్టం ప్రియురాలికి కోపం తెప్పించటం.....ఏదైనా, సవతిపేరు ఎత్తటము సవతి పేరు ఉచ్చరింపక పోయినా, సూచనగా సవతిని ఉద్దేశించి చేయునట్టి తత్ప్రశంసాపరమగు సంభాషణాదికమూ, లేక అట్టి సవతికి తాంబూలమును పంపుట మొదలగునవి, ప్రియురాలు సహింపరానివనియు, ఇవియే ప్రణయ కలహాలకు కారణాలనియు, సూత్రార్థము.

కోపం వచ్చిన తరువాత, నాయక "వాచే" మాటల చేతనూ, కార్యతః కార్యముల చేతను కలహ మొనర్పవలయును. తల వెండ్రుకలను విదల్చుట, నాయకుని శిరోజములను పట్టుకొని కొట్టుట, శయనమునుండి లేచి భూమి



(అని పిలిచి..............................336 పుట.)

మీదపడి దొర్లుట, ధరించిన పుష్పములనూ, మాలికలనూ, సొమ్ములనూ విచ్చివేయుటా, ఇత్యాదులుచేయగావలయును అని రెండో సూత్రం. ఇది అంత కష్టమైన పనిగాదు. కోపం అంటూ చెప్పాలి గాని, ఇంతకంటె వెయ్యి రెట్లు విలువైన పనులు జేస్తుంది మా కాంతం.

ఇక మూడో ఘట్టంలో అనునయమూ శయనారోహణమూ, అపరాధ స్మరణా తదుపరి పాదతాడనం, అనంతరం, అశ్రుకరణము, ద్వారదేశగమనం, యుక్తితోను నీయమానమ్, ప్రసన్నత, ఆలింగనం, చివరకు సంయోగం ఇవి జరగాలిసిన విధులు. అన్నింటిలోనూ, ప్రధమ ఘట్టంలో ప్రణయ కలహానికి కారణం కల్పించటంలో నే ఉంది కష్టం అంతా. మహారాజులకు అష్టభార్యలో అష్టాదశ భార్యలో ఉంటారు కాబట్టి సవతి ప్రశంసచేయటం సంభవ మౌతుంది. ఏదో ఒక్కగాని ఒక్క ఆవిడతో దేవుళ్ళాడుతూ ఉన్న ఈ సామాన్య జీవికి అదెట్లా సాధ్యం అవుతుంది. పోనీ, ఒక పరస్త్రీని గురించి ప్రశంసించి, కలహాన్ని అంకురింపజేయ వచ్చునుగాని, దాని తరువాత మా ఆవిడజేసే హంగామాకు మాకు ఈ సూత్రకారుడు బాధ్యుడవుతాడా?

ఇది ఒక పెద్ద సమస్య అయిపోయిందే ఎట్లాగా అని ఆలోచిస్తున్నా. ఇంతలో గాజుల చప్పుడు వినపడ్డది. గుండె ఝల్లుమన్నది. వచ్చింది కాంతం, ఒక చేత్తో వెండి మరచెంబుతో మంచినీళ్లు రెండో చేత్తో పళ్లెంలో రవ లడ్డూలూ పట్టుకొని............

౨

కొంతమంది, ప్రియురాలిని రమా రమ్యాకారయనీ, చతుర వచనయనీ, చారు చికురయనీ, వియూల్యాలంకారయనీ, ఏమేమో వర్ణిస్తారు. కాని మా ఆవిడ మామూలు మామిడిచిగురు చీరతోనే వచ్చేసింది. ఉజ్వల నయనాలు లేవు. మామూలు కళ్ళే. చిక్కని చెక్కిళ్ళే. అయినా విరక్తి జెందక ప్రణయకలహం జరపటానికి నిశ్చయించుకొన్నాను.

ఆవిడవచ్చే గవటంతోనే నేను ఎదురుగా వెళ్ళి, ప్రియురాలా, నీకై పరితపిస్తున్నాను. నే నిట్లుండుననినీ వెరింగియు, ఎందు కింత ఆలస్యము చేసినావు? అని చెప్పాలె! సరే అట్లాగ చెప్పాను.

కాంతానికి ఇంకా తెలియదు. ఆ రోజున జరగాలిసిన కార్యక్రమము. అంచేత నామాటలు విని, అట్లా మాట్లాడుతున్నారేం? వెకిలి చేష్టలు చేయకండి. ఎవరైనా వింటే నవ్వుతారు! అన్నది.

ఇంత ఆలస్యం చేశావేం? అన్నాను.

"ఆలస్యం ఏముంది! మామూలుగా ఇల్లు సద్దుకొని పిల్లలను నిద్రపుచ్చుకొని, వచ్చాను."

"చిలుకలను, గోరువంకలనూ మాట్లాడించావా? సాయంత్రం?" అన్నాను. కామ సూత్రాలలో ప్రియురాలు సాయంత్రం చేయతగిన విధులను జ్ఞాపకం చేసుకొంటూ.

"చిలుకలేమిటి? గోరువంక లేమిటి? ఏమిటో అసందర్భం ప్రలాపాలు నాకర్థం కావటంలేదు" అన్నది.

"ఏంలేదు కాంతం. అల్లా తెల్లబోయి చూస్తావేం సుమా? నేను మామూలు మనిషినే! ఊరికే నే నవ్వుతూ అల్లా అన్నాను.

"మన పిల్లలే మనకు చిలుకలూ, గోరువంకలూ, ఇప్పటిదాకా వాళ్లతో మాట్లాడుతునే ఉన్నాను."

"ఇటురా, కూర్చో."

వచ్చి నాదగ్గిరే కూర్చుంది శయ్యపైన. ఇక ప్రణయ కలహానికి కారణం కల్పించాలి. ఉన్న కష్టమంతా అక్కడే. సవతి అనిగాని పరస్త్రీతో పరిచయం అనిగాని ప్రశంసించానో కొంప మునిగిందే. లేని పోని రగడ ఎందుకని ఆలోచించి ఇంకో విధంగా ప్రణయ కలహానికి కారణం కల్పించాను.

"కాంతం?..."

"ఊఁ......"

"మన సీతను చూడటానికీ..."

"సీత ఎవరు?........."

"సీత నెరగవు? మా మేనమామ కూతురు."

"ఆ...అయితే?"

"సీతను చూడటానికి రేపు వెడుతున్నాను."

"వెళ్లండి. నా ఆజ్ఞ ఎందుకు?

"ఆజ్ఞకోసం కాదు. ఊరికే చెబుతున్నాను. సీత చాలా చక్కంది సుమా? దాన్ని నే నసలు పెండ్లాడుదా మనుకొన్నాను. దైవం అనుకూలించక పోవటం మూలాన పడింది కాదు."

"ఇప్పుడు మటుకేం? నలుగురు పిల్లలతో కూడా వస్తుంది కనుక్కోండి."

"అది కాదు నే ననటం. అది చక్కని దన్న మాట ఒప్పుకొంటువా?"

"అయ్యో, కాకేం! చక్కని చుక్క. ఒక్క జాతిలో పుట్టిన వాళ్లేకా మీరంతా?"

సీత చక్కదనాన్నిగూర్చి ప్రశంసా వాక్యాలు పలికి కాంతం సౌందర్యవతి కాదని కాస్త ఎత్తి పొడిస్తినా కోపం తప్పక వస్తుంది. తదనంతరం ప్రణయ కలహం అవిచ్ఛిన్నంగా జరపొచ్చునని తోచింది.

"నలుగురి పిల్లల తల్లి అయినా, ఆమె శరీరచ్ఛాయ ఒక్క వన్నెకూడా తగ్గలేదు. చెక్కిళ్లు చిక్కలేదు. కేశములూ......"

"చాలు. చాలు. ఇక అక్కడ ఆగండి."

"ఆమె చంపల నునుపూ......ఆ ముంగురుల..."

"ఏం మాటలివి? పరాయి ఆడదాన్ని గురించి ఇటువంటి మాటలు వింటుంటే నాకు అరికాలు మంట..."

"వచ్చిందా కోపం?..."

"ఆఁ..."

"అయితే చప్పున లేచి క్రిందపడు నేలపైన మెల్లగా సుమీ? ఇక జరిపేద్దాం ప్రణయకలహం" అన్నాను నేను తలపెట్టిన కార్యం అవిఘ్నంగా జరుగుతున్నదన్న సంతోషంతో పొంగిపోతూ.

"మీకేమైనా మతిపోయిందా? అట్లా తోస్తారేమిటి? నాకేం కర్మం క్రింద పడ్డదా కొ?" అన్నది కొంతం కరుకు కత్తి విదిలింపుల్లాగ మెరస్తున్న కళ్లతో."

"అది కాదు. సత్యభామ, వరూథిని, ప్రభావతీ మొదలైన నాయికలు ప్రణయకోపం వచ్చినప్పుడల్లా క్రింద పడ్డారు. నీవు అల్లాగ పడకపోతే ప్రణయకలహం ఎట్లా జరుగుతుంది?"

"జరగకపోతే, ఇప్పుడేమి, ఉపద్రవం? మతిపోయిన చేష్టలన్నినూ! తోస్తారేమిటి?...ఇవ్వాళ...మీకేదో... ఉండండి, నా పక్కమీదికి నేను వెళ్లిపోతాను."

"పోమరి......"

"ఏమిటబ్బా ఇవ్వాళా!......ఆ దొరల సహవాసం చేస్తున్నారు? క్లబ్బులో పొద్దు పోయిందాకా ఉంటున్నారు. ఏం కర్మమో..." అనుకొంటూ మరో ప్రక్కమీది కెళ్లి పడుకుంది.

## 3

ఇంతవరకూ ప్రణయకలహం జయప్రదంగా జరిగింది. రెండో ఘట్టంలో నాయిక వివృద్ధక్రోధయై మాలికలనూ, అలంకారాలనూ, విచ్చి వేయాలే. కోపం వచ్చింది గదా? ఆ పనులు చేయకపోతుందా అనుకొన్నాను గాని, ముడుచుకొని మెదలకుండా పడుకొంది. ఆమె జుట్టులోనున్న గులాబి పువ్వుమాత్రంనున్న జూచి కన్నెర్రజేసింది. నేనే వెళ్ళి ఆ పువ్వును తీసి, ముక్కలు ముక్కలు జేసి, క్రింద వెదజల్లాను.

తదుపరి కొంతం ప్రక్కనే కూర్చుని, "కాంతం, చూడూ నాతప్పు క్షమించు, నీవే చక్కని దానివి. పిల్లల తల్లివైనా, నీ చెక్కిళ్లపై నునుపు తగ్గలేదు. రజితకేశములు అట్టే లేవు, శరత్కాలమునందలి పూర్ణచంద్రునితో సమానమైన ముఖముగల సుందరీ, ఓ తరుణ వయస్సుగల విలాసినీ, లెమ్మి, శయనారోహణము చేయుము" అని మళ్లా పుస్తకంలో మాటలు అన్నాను. కొంతం, నావంక వెర్రిచూపులు చూడటం సాగించింది. ఆమె భయంచేత కంపిస్తూ ఉన్నట్లు నాకు తోచింది.

"ఏం, భయములేదు కొంతం. నా పక్కమీదికిరా" అన్నాను.

"ఏమిటో వికారం! నేనేం జేశాను. ఇందాక నెట్టివేయట మేమిటి? ఇప్పుడు మళ్లీ ఈ బ్రతిమి లాడటం ఏమిటి?

"అట్లా నేనెప్పటికీ చేయనులే. రా. లేచిరా. నా తప్పును గమనించక క్షమించు."

"నేను క్షమించటం ఎందుకు? ఏమిటో గోలా? సరే పదండి."

"ఉండు...ఉండు. లేవబోకు. లేవద్దు ఉంటే! ప్రణయ కలహం క్రమరీత్యా జరగాలె. నీ విప్పుడో పని చెయ్యాలె."

"ఏమిటది?..."

"నేను చేసిన అపరాధాన్ని తల్చుకొని, నా వీపు నడుమ, ఎక్కడైనా ఒక్క తన్ను తన్నాలె కొంచెం మెల్లగా. అంతటితో ప్రణయ కలహానికి ముదురుపాకం వస్తుంది. అటు తరువాత నేను బ్రతిమిలాడటం, నీవు కొంతసేపు అనుకరణం చేయటం తదుపరి శయనారోహణం ఇది జరగాలసిన విధి."

"ఇంతపనీ జరగాలిసిందే ఇప్పుడు!"

"లేకపోతే ప్రణయ కలహం పూర్తిగాదు."

"ఇట్లా జరగాలని ఎక్కడుంది?"

"పుస్తకంలో ఇదిగో కామసూత్రాలు. అందుకనే ఈ అవస్థంతా నేను పడటం! ఊఁ...ఒక్క చిన్న మెల్లగా తందూ?

"అదో, సంగతి మహారాజా? నేను వెర్రిబాగుల దాన్ని. ఇందాకటినుంచీ మీకు మతి చెడిందేమో నని హడలి పోతున్నాను. అడ్డమైన పుస్తకాలూ చదివి నన్నే డిపిస్తున్నారా. వెధవ వెకిలి పనులన్నీ నన్ను చేయ మంటూ?

"అయితే ఏమంటావు? ప్రణయ కలహం ఇందాక వచ్చింది. ఇక సగంలో ఉంది. పాడు జేస్తావా?" అన్నాను అప్రయత్నంగా జీరపోయిన గొంతుకలో.

"ప్రణయ కలహం జరపాలా? జరుపుతాను? జరుపుతాను! ఇల్లా రండి!"

అని పిలిచి అల్లరి కుర్రాణ్ణి దండించే ఉపాధ్యాయుడు పోజులో నాచెవి తమ్మె పట్టుకొని నులేసి, ఇక ఎన్నడూ?............"

"అబ్బా!..."

"ఇక ఎన్నడూ, ఈలా............ఏం?"

"ఊఁ...హా...అబ్బ!..."

"మరి ఎన్నడూ చేయరు గద!"

ఊహుఁ ఉహుఁ............వదుల్దూ."



## వో ముఖ్య విషయం

వ్యాసరచకులంతా తమవ్యాసాల్ని బహుక్లుప్తంగా పుట కొకప్రక్క-చొప్పున నాల్గుపుటలకి మించకుండా వ్రాయాలి. మాచే నిరాకరింపబడిన వ్యాసాల్ని త్రిప్పి పంప జాలము. కావున వ్యాసరచకులు తమవ్యాసములయొక్క ప్రతి నొక్కొక్క-దానిని తమ వద్ద యుంచుకొనవలెను.

☞ అనువాదములుగాని అనుకరణములుగాని యామోదకరములు కావు. వ్యాసములన్నియు స్వపోలకల్పితములై వుండాలి.

# ఇప్పు డెక్కడ మెయిల్ !....

• మునిమాణిక్యం నరసింహారావు •



ఆ రోజు ఆదివారం.

మరునాడుకల్లా నేను బందరు స్కూలుకి వేళకు చేరాలె. ఆ రోజు మెయిలులో ప్రయాణం చేస్తేనే నేను మరునాడు బడికి వేళకు వెళ్ళగలను. ఆ బండి తప్పితే నేను చాలా చిక్కులలో పడటం జరుగుతుంది.

మెయిలు తెల్లవారుఝామున నాలుగింటికి వస్తుంది తెనాలికి. నేను ఇంటిదగ్గర రెండున్నరకు గాని మూడింటికిగాని బయలుదేరి మెయిలు సులభంగా అందుకోవచ్చు.

అయితే నాకో భయం వేసింది మూడింటికి మెళకువ వస్తుందో రాదోనని : మా ముసలావిడ నేను లేపుతాను, మీకేమీ భయంలేదు అన్నది కాని నేను ఆమె మాట వినలేదు. గడియారము లేదు. ఆమెగారికి సరిగ్గా మెళకువ వస్తుందని నమ్మకమేమిటి ? ఒకవేళ కర్మంచాలక ఆవిడకు మెలకువ రాకపోతే ఏంకావాలె, అని ఇల్లాగ ఆలోచించి, ఎందుకైనా మంచిది వెళ్ళి స్టేషనులోనే కూర్చుందామని ఇంటిదగ్గరనుంచి బయలుదేరాను.

తీరా బయలుదేరిపోతూ దార్లో ఒక కాఫీ హోటలులో చూద్దునుగదా పదకొండే అయింది!

అప్పుడు ఏంచేసేది?

మళ్లీ ఇంటికి వెళ్ళటానికి బుద్ధిపుట్టలేదు. యథాకాయకిని స్టేషనుకు వెళ్లేను. అప్పటికి ఎంత అయిందో చూద్దామని స్టేషనుమాస్టరు గదిలోకి వెళ్ళాను. అక్కడ గడియారం ఉంది గాని, అది చెడిపోయిందికామాలు. దాని ముఖంపైన కాగితం ముక్కలు అంటించి ఉన్నాయి. స్టేషనులో ఇంకెక్కడా గడియారం లేదు.

స్టేషనుమాస్టరు అక్కడేదో పనిచేసుకొంటున్నాడు. నేను వెళ్ళి అయ్యా, ఇప్పుడెంత అయిందండీ ? అని అడిగాను. 'స్టేషనులో గడియారం లేదు. సుమారు పదకొండున్నర అయివుంటుందండి' అన్నాడు ఆయన.

మీకు గడియారం లేకుండా ఎట్లా జరుగుతుందండీ అని నేను అడిగాను. ఆయన ముఖం కోపంగా పెట్టి నీకెందుకయ్యా ఆ సంగతి అంతా ? అన్నాడు.

నేను ఎంతో సానుభూతిని చూపాలని ప్రయత్నించేస్తే అతడు గ్రహించలేదే అనిమాత్రం విచారపడ్డాను. అంతేకాని ఆయన కటువుగా మాట్లాడినందుకు నేను పోట్లాట పెట్టుకో లేదు. అయితే మెయిలు ఎన్నింటికి వస్తుందండీ? అని అడిగాను.

ఇప్పుడెక్కడ మెయిలయ్యా! ఎప్పుడో తెల్లవారుఝామున నాలుగింటికి వస్తుంది అన్నాడాయన కొంచెం విసుగుగా.

సరేనని నేను అవతలకు వెళ్ళిపోయినాను. కాసేపు అవీ, ఇవీ చూస్తూ తిరిగాను. ఏమీ తోచలేదు. గేటు తీసేఉన్నది. ప్లాట్‌ఫారంమీదికెళ్ళి బెంచీమీద కూర్చున్నాను. పిండారబోసినట్లు చక్కని వెన్నెల. ప్రాణాన్ని హాయిగొలిపే చల్లని గాలి వీస్తున్నది. ఆ చంద్రబింబం కేసి చూస్తూ, ఆ సౌందర్యాన్ని చూచి ఆనందిస్తూ కాసేపు గడిపాను.

అప్పటికి పన్నెండు అయి ఉంటుంది. ఇంకా నాలుగు గంటలు గడవాలె. ఈ నాలుగు గంటలూ మేలుకొని అల్లాగ కూర్చుని ఉండటం చాలా కష్టం, కాస్త నడుమువాల్చి ఒక్క కునుకుతీస్తే నేమి ? నిద్రపట్టి మెలకువ రాదేమోనని భయం వేసింది.

మెయిల్ బండి ధన్, ధన్ మని పెద్ద మోత చేస్తూ వస్తుందికదా, నాకు మెలకువ రాకుండా ఎల్లాగ ఉంటుంది. అంత మొద్దునిద్రా నాది ? అనుకున్నాను.

అనుకొని ఆ బెంచీపైనే పడుకొన్నాను. కాని సరిగ్గా నిద్రపట్టలేదు. ఒక పక్కను భయము.

మరునాడు స్కూలుకు పోయితీరాలె. సెలవల ఆఖరున స్కూలు తెరిచే రోజు అది.

ఆ రోజున స్కూలుకు హాజరు కాకపోతే, సెలవలజీతం అంతా పోతుంది. ఈ భయంతో నిద్ర పట్టలేదు చాలాసేపు.

కళ్ళు తెరుస్తూ మూస్తూ పడుకొన్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో నాకు తెలియదు. ఎంతసేపు నిద్రపోయినానో తెలియదు. గబుక్కున లేచి కిటికీవద్దకు వెళ్ళాను. స్టేషనుమాస్టరు ఏదో పని చేసుకొంటున్నాడు. వెళ్ళి అడిగాను. 'సార్, టైము ఎంత అయిందండీ?' అని.

ఇంకో మాటకూడా అన్నాను, 'ఇక్కడ గడియారం లేకపోవటంమూలాన మిమ్ముల్ను అడగవలసివస్తున్నదీ' అని క్షమాపణపూర్వకంగా. ఈ తభా అతడేమీ విసుక్కోలేదు. మర్యాదగానే అన్నాడు 'ఇప్పుడెక్కడ మెయిల్ అండీ!' అని.

అప్పటికి టైము ఎంత అయిందో తెలియదు. ప్లాట్‌ఫారంమీద కొద్దిమంది జనం ఉన్నారు. చాలామంది పక్కలు పరుచుకొని పడుకొని ఉన్నారు. ఆకాశంవంక చూచి నా బుద్ధినంతా వినియోగించి అప్పటికి ఒంటిగంటకంటే ఎక్కువ అయి ఉండదని నిశ్చయించుకొన్నాను.

నిద్ర ముంచుకొస్తున్నది. ఇంకా చాలా టైము ఉంది. అందుకని మళ్ళీ పడుకోవాలెనని బుద్ధి పుట్టింది, పడుకొన్నాను. ఒక్క కునుకుపోయి చటుక్కున లేచివెళ్ళి మళ్ళీ అడిగాను స్టేషను మాస్టరును 'ఏమండీ మెయిల్ ఎప్పుడు వస్తుంది?' అని.

'ఇప్పుడేగదయ్యా వచ్చి అడిగావు! ఇవ్వాళ మెయిల్ లేటుగాకూడా వస్తుంది. ఇప్పుడెక్కడ మెయిల్, పోయి పడుకోవయ్యా!' అన్నాడు ఆయన.

అప్పటికి మహా అయితే రెండు అయి ఉంటుందో, ఇంకా తక్కువేమోనని ఊహా కలిగింది.

రైలువస్తే జనం అంతా లేవటం, గోలచేయటం జరుగుతుందిగదా, ప్లాట్‌ఫారంమీదే ఉండి మేల్కోలేకపోతానా అని అనుకొని మళ్ళీ పడుకొన్నాను.

కాసేపటికి మళ్ళీ ఉలిక్కిపడి లేచాను. ప్లాట్‌ఫారంమీద జనం అట్లాగే ఉన్నారు. కాని దగ్గరదగ్గర నాల్గు అయిందేమోనని అనుమానం కలిగింది.

మళ్ళీ వెళ్ళి స్టేషనుమాస్టరును అడిగాను 'మెయిల్ టైము అయిందండీ!' అని. ఆయన నా ముఖంవంక తేరిపారజూచి 'మళ్ళీ వచ్చావ్? ఇప్పుడెక్కడ మెయిల్ అయ్యా. పో!' అని విసుక్కొని నవ్వుకొన్నాడు, పల్లెటూరివాడివలె మాటిమాటికి వచ్చి అడుగుతున్నావని కాబోలు నవ్వుతున్నాడు ఆయన! పోనీలే! అనుకొన్నాను.

మళ్ళీవచ్చి బెంచీపైన కూర్చున్నాను. ఇక నిద్రపోదల్చలేదు. తెల్లవారుతూ ఉన్నట్టుగా ఉంది. ఇంకా మెయిల్ రాకపోవటం ఏమిటి? లేటు కాబట్టి ఇంకా కాసేపటిలో వస్తుందనుకొని అక్కడే కూర్చున్నాను.

ప్లాట్‌ఫారంమీద పడుకొన్నవాళ్లు ఎవ్వరూ లేవలేదు. ఇవ్వాళ మెయిల్ చాలా లేటు అయి ఉంటుంది అనుకొని ఒక అరగంటసేపు అల్లాగే కూర్చుని ఉన్నాను.

ఎప్పటికి గంట కొట్టరు!

బాగా తెల్లవారుతున్నది. మెయిల్ లేటు అయితేమటుకు ఇంకా రాకుండా ఉంటుందా అని భయంవేసింది.

మళ్ళీ వెళ్ళి అడిగాను 'ఏమి సార్ మెయిల్ టైము ఇంకా కాలేదండీ?'

స్టేషనుమాస్టరు పూర్వంలాగే 'ఇప్పుడెక్కడ మెయిల్ అయ్యా, వెళ్లు' అన్నాడు.

ఇప్పుడెక్కడ మెయిల్ అంటాడు. ఎప్పటికి మెయిల్!

ఎన్ని గంటలు లేటు!!

ఈ విషయాలన్నీ తెలుసుకొందామని 'మెయిల్ ఎన్నిగంటలకు వస్తుందండీ' అని అడిగాను.

వస్తుందయ్యా, దాని టైము ప్రకారం అది వస్తుంది అన్నాడు.

ఈ జవాబులు చూస్తే నాకు కాస్త కోపం వచ్చింది. నాయందు గౌరవంతో మాట్లాడుతున్నట్లు లేదు. అందుకని కాస్త కోపంగానే అన్నాను. 'దాని టైముకే వస్తుంది లెండి. ఆ సంగతి తెలియకపోలేదు. కాని ఇవ్వాళ దాని టైము ఎప్పుడూ అని అడుగుతున్నాను.'

ఆయనా కోపంగా అన్నాడు 'చిత్రం. ఇవ్వాళ ఇంకా మెయిల్ ఏమిటయ్యా రేపు తెల్లవారుఝామున నాలుగు గంటలకయ్యా కలకత్తా మెయిల్. ఇప్పుడెక్కడ మెయిల్ అయ్యా పో' అన్నాడు.

# బహుముఖాల అద్దం

మునిమాణిక్యం నరసింహారావు, బి.ఏ., ఎల్.టి.




అదీ మా పడకగది ఒకప్రక్కన పందిరిమంచం దానికెదురుగా గోడపైన నిలువుటద్దం. ఎదురుగా పుస్తకాలు మంచానికి ప్రక్కన నేను కుర్చీలో కూర్చుని వ్రాసుకొంటున్నాను. నాకు ఎడమవైపున ఉన్న బల్లపైన పుస్తకాలు కుప్పలుకుప్పలుగా ఉన్నాయి గోడలమీద అయిదారు చక్కని బొమ్మ లున్నాయి.

గడియారంలో అప్పటికప్పుడే తొమ్మిదైంది ఆ బల్ల మీద నున్న కాంపోజిషన్ పుస్తకాలన్నీ ఎప్పుడు దిద్దుతానా అని దిగులేసింది అవన్నీ దిద్దేసి మర్నాడు పిల్లలకు ఇచ్చివేయాలె పట్టుదలతో కూర్చుని ఒక్కొక్క పుస్తకమే దిద్దటం ప్రారంభించినాను సంవత్సరం పొడుగునా ఇట్లా దిద్దినా మొదటిరోజున ఏంతప్పులో చివరరోజునా సరిగ్గా అవే తప్పులు మరి ఈ కృషిఅంతా ఎందుకో మా అధికారులకే తెలియాలె వివిధములైన మొక్కలు పెరిగే కొండలు వైద్యులకు మందులు చేయటానికి మిక్కిలి ఉపయోగం అనేవాక్యం దిద్దటం ఎట్లాగా అని ఆలోచిస్తూ ఉండగా వచ్చింది కాంతం

వచ్చిందన్నమాటేకాని నాగోలలో నేనున్నాను. కుర్రవాడి ఉద్దేశం మొక్కలు మందులు చేయటానికి ఉపయోగపడతాయని కాని కొండలను మందులు చేస్తారని కాదు ఇట్లాగే అవకతవకగా వ్రాస్తుంటారు కుర్రకుంకలు వాటిని సరిచేయటంలో మా ప్రాణాలు హరించుకు పోతుంటవి. గొడవల్లో పడుండి వాక్యాన్ని కొద్ది మార్పుతో పూర్తిగా అర్థంవచ్చేలాగున ఎటా మారుద్దామా అని ఆలోచిస్తూ, ఆవిడ రావటాన్ని కళ్ళతో చూచాను...

......కాంతం వచ్చింది సన్న గోరంచు పొందూరు చీర కట్టుకొని వాయిలా క్రీం బాడీస్ వేసుకొన్నది బర్మా ముడి దానిపైన అర్ధచంద్రాకారంగా పూలు.

వచ్చి అద్దానికి ఎదురుగా నిలబడి గాజులూ పమిటా సవరించుకొని ముంగురులు దిద్దుకోటం నేను చూస్తూనే ఉన్నా కళ్ళతో, కాని మనస్సుమాత్రం వాక్యరచనలో లగ్నం అయి ఉంది.

నావంక చూచి కాంతం నవ్వింది...... నేను తలవొంచు కొని వ్రాసుకొంటున్నాను. తర్వాత ఆవిడ అక్కడే నిల్చొని కుచ్చెళ్లు విదిలించటం నాకు వినిపించింది. నేను తలఎత్తి చూడలేదు. పౌడరుకాకపోతే ముఖానికి అద్దుకొని అద్దంలో చూచుకొంటున్నది కాంతం. నేను ఇవన్నీ కని పెట్టుతున్నా. తలెత్తకుండా వ్రాసుకుంటూ ఉండటం మూలాన ఆవిడ "కొత్తదుప్పటి వేశారే పక్కమీన" అన్నది పరుపువంక చూస్తూ చిరునవ్వుతో. నేను కలం పుల్ల పళ్లతో కొరుకుతూ, "అవును" అన్నట్లు తలకాయ ఊపాను.

కాంతం మళ్లీ అద్దం చూచుకొని తిలకం దిద్దుకొన్నది. వడ్డాణం తీసి గజ్జలు గలగల లాడించి కటిస్థానందగ్గర కుచ్చెళ్లు సద్దుకొని వడ్డాణం పెట్టుకొని,

"ఏమిటి వ్రాస్తున్నారు" అన్నది.

"ఏముంది? బడిపంతులుచేసే మహాకార్యాలేమున్నయి? కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకోటం, అమృతాంజనం రాచుకోటం" అన్నాను విసుగ్గా.

కాంతం పకాపకా నవ్వింది. అయితేనేం నామట్టుకు నేను స్పెల్లింగుతప్పులు దిద్దుతున్నాను. ఫీల్డు స్పెల్లింగు Field ఆ లేక Feild ఆ అని సందేహం తోచి డిక్షనరీ చూస్తున్నాను. ఇంతలో పసిపిల్ల మెసిలి దగ్గింది.

"లేస్తుందికాబోలు, ఇప్పుడే నిద్రపుచ్చి వచ్చా" అన్నది ఆవిడ.

నా కామాటలు వినిపించినా, నేనేం మాట్లాడలేదు. ఇంతలో కాంతం మేడ దిగి, వీధితలుపు గభీలుమని వేసి వచ్చి పట్టెమంచందగ్గర నుంచుని పెద్దగా ఆవలించింది. పడుకొంటుందికాబోలు అనుకొన్నాను. కాని ఆమె పడుకోక ఆరోజున చేసిన జిలేబీ వెండిపళ్లెంలో పెట్టు కొని వచ్చి "తినండి" అని బల్లమీదపెట్టి వెండి గుండు చెంబుతో మంచినీళ్లుపెట్టి నావంక చూచి,

"తినరేం" అన్నది.

"అక్కడ పెట్టు" అన్నాను నేను,

కాంతం మళ్లీ అద్దందగ్గరకు పోయి ఇంకోసారి సద్దు కొని,

"నాబ్రోచ్ చూశారా" అన్నది.

"అబ్బ! ఏమిటి నీ ప్రశ్నలూ, నీపూసూ, నీ బ్రోచ్ సంగతి నాకెందుకూ? నన్ను రాసుకోనీ" అన్నాను.

"అహా; ఎందుకండీ అంత విసుగూ? మీరాతకు నేనేం అడ్డం వచ్చాను. నాబ్రోచ్ ఎక్కడైనా చూశారేమోనని అడిగాను." అని అంటూ నవ్వింది. నవ్వితే నవ్విందని నేను మళ్లీ పుస్తకం తీసుకొని తప్పులు చూస్తుంటే, కాంతం అక్కడే నుంచుని బ్రోచ్ పమిటకు పెట్టుకొంది.

అప్పటికి నేను దిద్దవలసిన పుస్తకాలు ఇంకా ఇరవై ఉన్నాయి బల్లమీద. ఒకొక్కటే తదేకదీక్షతో దిద్దే స్తున్నాను. కాంతం గడియారంవంక చూచి "అబ్బ పదైంది. పడుకోవాలె ఒక్క గడియైనా నిద్రపోతాను. పన్నెండు కొట్టేటప్పటికల్లా రకీమని లేస్తుంది పసిముండ, ఎవరో కొట్టిలేపినట్లు" అని స్వగతంకాబోలు ప్రకాశంగా అన్నది. "ఎవరు పడుకోవద్దన్నారు" అన్నాను నేను ఆ మాటలు విని కాంతం నావంక ఏదో వింతగా చూస్తున్నా నేను గమనించక పురపాలక సభాధ్యక్షుడు చేసేపనులను గురించి వ్రాస్తూ కుర్రాడు "ఈయన ఆరోగ్యవారములో ఉత్సవములు జరుపును పందులను కుక్కలను చంపించును. వోట్లకోసం తిరుగును" అని వ్రాయటం చూచి వీడి దుంప తెగ. ఇవేనా ఆయన విధులని వ్రాయాలసినవి అని అను కొని, అంతా కొట్టేద్దామా, లేకపోతే విషయాన్ని గురించి చూడక వాక్యరచనలో ఉండే తప్పులుమాత్రమే దిద్దు దామా అని ఆలోచిస్తూ ఉండంగానె కాంతం నాపైన కాలకొచ్చి, "ఇందాక మీరు తెచ్చిన గులాబిపువ్వు ఎక్కడ పెట్టారు" అన్నది.

"అదేం, నీముందు బల్లమీద పళ్లెంలో కనపడటంలా" అన్నాను నేను ఆర్చుకుపోయిన గొంతుకతో.

ఎదురుగాఉన్న బల్లపై నున్న పువ్వును తీసుకొంటానికి ఆవిడ నాచుట్టూ తిరిగిపోయింది, అప్పుడే చాకలి ఘుడత్త

విప్పి కట్టడంమూలాన, చీర, గంజిబిగువున ఉండి నడుస్తుంటే రవరవశబ్దం అయింది. ఆవిడ తలకు రాచుకొన్న నూనె సంబంధమైన సువాసన నన్నూ, నా కొంపోజిషన్ పుస్తకాలనూ ముట్టడేసింది.

శత్రువులు ముట్టడివేసినా, సాధ్యమైనంత వరకు లొంగకపోవటం ధీరలక్షణంగదా అని అనుకొంటూ ఉండంగానే ఆ ఇరవై పుస్తకాలు నావంక చూచినవి. ఆ ఇరవై ఒక్కమారు! విధి నెరవేర్చాలన్న మాటలు చెవులో రహస్యంగా వినిపించినాయి.

## ౨

ఇంకా పదిహేనుపుస్తకాలున్నవి. తలఎత్తి చూద్దును గదా, కాంతం ఇంకా అద్దంముందే నుంచుని, తన సౌందర్యాన్ని చూచుకొని మురిసిపోతున్నది. నేనూ నవ్వుకొన్నాను.

"ఎందుకు నవ్వారు"

"ఊరికేనే"

"చెబుదురూ"

"ఏముంది చెబటానికీ, ఊరికేనే నవ్వాను" అని కలం విదిలించాను.

"అబ్బ! చెప్పరూ, ఎందుకు నవ్వారు."

"............"

"అదుగో, మళ్లీ నవ్వుతున్నారు...చెప్పరూ...అంత నవ్వు ఊరికేనే వస్తుందా?"

"చెపటంలా-ఎందుకూ లేదూ, నవ్వొచ్చింది నవ్వాను."

"............"

"అబ్బ, ఎందుకమ్మా అంత నవ్వు?"

"ఏంచెప్పేది? ఏంకారణం లేదు."

"అట్లా కాదు, చెప్పాలె?"

"ఊరికనే..... "

"ఊ...అల్లాగేం? చెప్పాల...ఊ...తప్పదు..."

"వదులు, కలం వదిలేశెయ్యి"

"వదిలా, చెప్పండిమరి"

"నీ తలలో......"

"ఆ, తలలో ఏమిటి?. "

"గులాబిపువ్వు..."

"అబ్బ, ఏమిటా విరగబడి నవ్వటం! తలలో గులాబి పువ్వుఉంటె అట్లా నవ్వొస్తుందా?"

"మరేంచెప్పేది, గులాబిపువ్వునుచూస్తే నవ్వొచ్చింది."

"ఆ, అల్లాగేం, చాల్లెండి గడుసుదనం, అసలు ఏమిటో ఉంది" అని అంటూ అద్దంలో చూచుకొని చెంపలు దిద్దుకొంది

"నిజంగా, కాంతం, ఆ గులాబిపువ్వును జూస్తే నవ్వొచ్చింది."

"చాల్లెండి మీ కవిత్వం. చెప్పకపోతే మిమ్మల్ని వ్రాసుకోనివ్వను."

"కలం వదులు. ఇదిగో ఈ పుస్తకాలు దిద్దిందాకా ఉండు చెబుతాను "

"అబ్బా! ఇప్పుడు చెప్పాలిసిందే"

"నీకు కోపంరాదుగదా?"

"కోపంలేదు, తాపంలేదు, చెప్పండి"

"మరి...గులాబీ...పువ్వో..."

"అబ్బబ్బ, ఏమిటండీ ఆ విరగబడినవ్వటం. దేనికైనా కారణం ఉండాలె!"

"కారణం లేకేం, బ్రహ్మాండమైన కారణం ఉంది"

"చెప్పండిమరి!"

"నీతలలో, ఆ నల్లటికెంట్రుకల మధ్యా. ."

"గులాబిపువ్వుంది. అదేకాదు మీరంటం"

"కాదు."

"ఏమిటి మరి"

'ఆ నల్లటితుమ్మెద రెక్కలవంటి మృదువైన నున్నని నటువంటి. ...."

"అబ్బబ్బ, ఏమింటండీగోల, తెలుగులో చెప్పండి."

"నల్లమేఘాలలో మెరుపు మెరుస్తున్నది."

"ఇస్సీ, మీ కవిత్వం నాకర్థంగాదు."

"చెప్పేస్తాను ఉండు. నీతలలో ఒక తెల్లవెంట్రుక మెరుస్తున్నది'—"

"ఓయబ్బ! ఈమాత్రానికేనా ఇంతనవ్వూ. ఏదీ, తీసేద్దా మంటే కనిపించటంలేదే! పోనీయండి నాకేంతక్కువ!"

"తక్కువ అని కాదు. వృద్ధాప్యం తొంగిచూస్తున్నది."

"అవునవును, కవిత్వంలో చెప్పాలిసొస్తే అంతే.. చాల్లెండి, మీకవిత్వమూ మీరూనూ "

"ఉండు, నేను వ్రాసుకోవాలె"

# 3

ఇంకా పద్ధానగు పుస్తకాలున్నవి. కాంతంమట్టుకు అద్దంముందు నుంచొని మళ్లీ ఇంకోసారి కుచ్చెళ్లు సర్దుకొని పమిట సవిరించుకొంటున్నది. నేను ఒకసారి పుస్తకాలవంక, మరోసారి, కాంతంవంకా చూచి తలొంచుకొని దిద్దటం సాగించాను. కాంతం అల్లాగే నిలబడి అద్దంలో చూచుకొంటున్నది చెక్కిళ్లు దిక్కునా గులాబి రంగులో మెరుస్తున్నవి చెంపలపైని జుట్టు కొద్దిగా జారింది తలలో నాలుగైదు వెంట్రుకలు నల్లటి ఆకాశంలో కనబడే మెరుపు తీగల్లాగ మెరుస్తున్నవి. తెల్లటిచీర, బ్రోచీ గులాబిపువ్వు మనోహరంగా ఉన్నవి... సరే.. ... పద్ధానుగు పుస్తకాలు అరగంటలో దిద్దుదామనుకొన్నాను. ఇంతలో కాంతం,

"ఏమండోయి" అన్నది అద్దంముందు నిలబడిఉండే.

"ఏమిటి?"

"ఇదేమిటి?" అన్నది కంపిస్తున్న గొంతుకతో

"ఏమొచ్చింది?"

"ఇల్లా ఒకమాటొచ్చి అద్దంలో చూడండి!"

"అద్దంలో నీకేం కనబడుతున్నది?"

"మీరు చూడండి తెలుస్తుంది."

"ఏమిటి చూసేది...అద్దంలో ముఖం కనబడుతుంది. నీముఖం నాకేం కొత్తది కాదు."

"అదిగాదండీ, చూడండి ఏదో. . తమాషాగానే ఉంది ఇందాకటినుంచీ లేదా ఇప్పుడిల్లా కనపటం ఏమిటి!

"ఎల్లా కనపడుతున్నదీ? . ఊరికే ఏదో పెట్టావు ...నాటకం! నావ్రాతకు వచ్చింది ఇంతకూ?" అని తలెత్తి చూద్దునుగదా కాంతం వింతగా చూస్తున్నది అద్దంవంక. అటుజరిగి ఇటుజరిగి ఏమిటో పరీక్షిస్తున్నది నేను ఎర్రసిరా కలం బల్లమీద పెట్టి,

"ఏమిటి అదీ! అన్నాను"

"ఏమిటోనండీ రెండుముఖాలు కనిపిస్తున్నాయి"

"రెండుముఖాలా?"

"అవును రెండుముఖాలు!"

"నిజంగా?"

"మీరు వచ్చి చూడండి నామాట అబద్ధమైతే" అన్నది.

సరే, ఏమిటో సంగతి చూద్దామని లేచి వెళ్లి అద్దం ముందు నిలబడ్డాను కాంతం, "చూడండి నామాట అబద్ధమైతే" అని నాకు చెప్తూ బల్లదగ్గర కెళ్లింది. నేను అద్దంముందు నిలబడి చూశాను ఏం విచిత్రం కనబడలేదు. చోటు మార్చి అటూ ఇటూ జరిగి నుంచొని, ముందు కెళ్లి వెనక్కెళ్లి అన్నివిధాల చూశాను ఎక్కడా నాకు ముఖాలు కనిపించలేదు ఇంతలో కాంతం బల్లదగ్గర జేరి పుస్తకాలు బొత్తిగా పెట్టేసి, కలం స్టాండులోపెట్టి, సిరా బుడ్డిపైన మూతపెడుతున్నది నేను చూసేసరికి

"ఊ, తెలిసిందిలే వెళ్లు."

"ఏమిటి తెలియటం, కనపడలా రెండుముఖాలూ?"

"ఊహు, కనుపించలేదు. నాముఖమే నాకు కనిపించింది"

"అచ్చంగా ఒక్కమొగమే! బాగా చూడండీ"

"చాల్లే, చాలించు నాటకం"

అని విసుగ్గా అని మళ్లీ కుర్చీలో కూలబడి పుస్తకం తీసి తప్పులు దిద్దటం సాగించాను,

## ౪

"ఏమిటండీ... మీరు కనబడకపోవటం నాకళ్లకేమైనా ——ఏదీ చూడనియండి మళ్లీ" అంటూ కాంతం అద్దం ముందుకు పోయి నిలుచున్నది.

"అదేమిటండీ, రెండుముఖాలూనూ, విడివిడిగా కనబడుతూ ఉంటేనే," అని కాంతం తెల్లపోయి చూడ్డం చూశాను నేను. ఆముఖ కవళికలు ఆ ముంగురుల చలనం ఆవీ, నిజం చెప్పేమనిషి కున్నట్లే ఉన్నవి. భయం ఆమె కళ్లలోనుంచి తొంగిచూస్తున్నది. నేనూ కొంచెం భయపడ్డాను. తన నీడను చూచి భయపడటం, తననీడలో రెండు ముఖాలు కనబడటం ఏదో చెడ్డలక్షణం అని చిన్నప్పుడెక్కడో చదివిన జ్ఞాపకం. అందుకని నాకూ కొంచెం భయంవేసి,

"ఏమిటి నిజంగా రెండుముఖాలు బాగా కనిపిస్తుందా?"

"ఇక్కడ నుంచుని చూడండి మీరు. నామాటలు అబద్ధం అయితే అవిగో, ముఖాలు——ఒకటీ——రెండూ—— విడివిడిగా కనుపిస్తూ ఉంటేనే" అన్నది.

నాకు ఎవో పిచ్చిఊహలు పోయినవి ఒకక్షణంలో. ఇదేమైనా నిజంగా చెడ్డలక్షణమా, లేకపోతే అద్దంలో ఏమైనా చెడ్డ స్పిరిట్స్ దూరి ఇల్లా అల్లరిపెడుతున్నాయా? అనిపించింది. అప్రయత్నంగా లేచి వెళ్లి అద్దం ముందు కాంతం వెనకాలె నుంచున్నాను.

చూశారా రెండుముఖాలు. నామాట అబద్ధం అంటిరే! నాకు భయమేస్తున్నదండీ, అంటూ కాంతం వెనక్కు జరిగింది నాకు దగ్గరసాగా.

అహ! రెండుముఖాలు ఏవీ అని నేను ఒకఅడుగు ముందుకు జరిగాను చూద్దామని.

కనపడటంలా అన్నది కాంతం.

నీముఖం అన్నాను నేను కోపంతో.

అవును, సెంబర్టూ, మీ మొఖం అన్నది కాంతం వెనక్కు విరగబడి నవ్వుతూ——————

---

## ప్రాముఖ్యవిషయం

వ్యాసరచకులంతా తమవ్యాసాల్ని బహుస్పష్టంగా పుట కొకప్రక్కచొప్పున నాల్గుపుటలకి మించకుండా వ్రాయాలి. మాచే నిరాకరింపబడిన వ్యాసాల్ని త్రిప్పి పంపజాలము. కావున వ్యాసరచకులు తమవ్యాసములయొక్క ప్రతి నొక్కొక్కదానిని తమ వద్ద యుంచుకొనవలెను.

☞ అనువాదములుగాని, అనుకరణములుగాని యామోదకరములు కావు. వ్యాసములన్నియు స్వకపోలకల్పితములై వుండాలి.

# కోర్టులో కాంతం

౧

ఇంటికి వచ్చాను. కోకైనా విడవలేదు. నలుగురు పిల్లలూ కమ్ముకున్నారు. ఒక్కసారిగా, "అమ్మకొట్టింది నాన్నా" అని చిన్నదీ, "అమ్మకొత్తింది" అని దాని తరువాత పుట్టిన నాలుగేండ్ల మొగపిల్లవాడు, "అమ్మ. ఊమ్ - ఊమ్ ము, అ" అని వాడితమ్ముడు రెండేండ్ల వెధవ అనటమేకాకుండ ఆ పసిముండకూడా చేతులెత్తి ఏదో పెద్ద ఫిర్యాదు చేసేదానిలాగ బొబ్బలు పెట్టటం సాగించింది.

నేను గుమ్మంలో కాలుపెట్టటంతోనే ఒక్కపెట్టున అందరూ ఇల్లా కంప్లైంటులు దాఖలుచేసేసరికి నాకు గుండె గుభేలుమన్నది. రోజూ ఈ నాటకం మామూలే అయినా పది నిమిషాలలో పని తెముల్చుకొని పైపెత్తరీయంతో బైటపడటానికి అవకాశం ఉండేది. ఆ రోజున అట్లా వీలులేదు. "ఫైలు ఎక్కువైందిరా భగవంతుడా" అనికొని, బడిపంతులు వేషాన్ని మార్చి, మేడపైకివెళ్లి దండుకు జేరగిలబడి చిరిచాపపైన కూర్చున్నాను.

అది మా కోర్టు. నేనే న్యాయమూర్తిని. న్యాయమూర్తినేకాదు. నేను సామ్రాట్టును. చక్రవర్తిని. నా ఆజ్ఞను తిరస్కరించేవాళ్ళు లేరు. నిరంకుశాధికారం చెలాయించే మహాప్రభువును. నారాజ్యము ప్రేమరాజ్యము అల్లాంటి. సమయంలో ఇటువంటి భావాలే నాజీవితాన్ని మధురంగా జేసేవి. మిగిలిన జీవితమంతా బానిసజీవితమే. అయితే జీవితంలో అల్లాంటి ఒక్క నిమిషానికి ఇరవైఏండ్ల సామాన్యజీవితానికన్న దానికంటె ఎక్కువ విలువ ఉన్నది.

ఊహాతోకూడిన ఈ మాధుర్యాన్ని వదలిపెట్టి అసలు విషయానికొస్తే ఈ చక్రవర్తి చిరిచాపమీద కూర్చున్నాడేమాఅంటే అనొచ్చు. మొగల్ చక్రవర్తులు అల్లాగే కూర్చునేవారని నా సమాధానం. అయితే వాళ్ళు రత్నకంబళములపై పట్టుపరుపులపై కూర్చున్నారు. నేనేమో ఈ చినిగిపోయిన చిరుచాపమీద కూర్చున్నాను.

ఈ న్యాయాధికారివళ్ళో ఎడపిల్లవాడు కూర్చున్నాడు. ఒకప్రక్కన చిన్నఅమ్మాయి కూర్చున్నది. వెనకాల పాలుతాగేది చేరి ఈ చక్రవర్తి నెత్తిమీద తన చిన్న చేతులతో దరవులాగ కొటుతున్నది. చేతులో వెండి గ్లాసుతో కాఫీ పట్టుకొని ముద్దాయి నిలువబడ్డది కోర్టువారి ఎదుట. గ్లాసు అందుకొని కాఫీతాగేశాను.




చిన్నది ఏడుస్తూనే ఉంది ఇంత సేపూ. "ఏమిటే అమ్మా." అని న్యాయ విచారణకు ఉపక్రమించాను.

ఈమాట వినేసరికి అందరికీ ఒక్కసారి మళ్ళీ దుఃఖంవచ్చింది. కాస్త ఊరుకోండని అందరిని ఊరకోబెట్టాను. పెద్దది దుఃఖాన్ని దిగమ్రింగి బుడ్డమూతి పెట్టుకొని కొంచెం దూరంగా కూర్చుంది. చూస్తే ఏదో అందరికి తలా నాలుగూ తగిలినట్లున్నవి. ముద్దాయి శాస్త్రరీతిగానే పాలుతాగేదాన్ని ఎత్తుకొని కోర్టువారిఎదుట నిలువబడి ఉన్నది. "ఎందుకు కొట్టిందే అమ్మనిన్ను" అని అడిగాను చిన్నదాన్ని.

"ఇవ్వాళ ఏంజేసిందో కనుక్కోండి" అన్నది ముద్దాయి.

"నీవు ఇప్పుడు మాట్లాడరాదు. ఫిర్యాది చెప్పేది అంతా ముందువినాలె. తరువాత నీ సంగతి" అని నేనన్నా కోర్టువారికుండే సహజమైన అధికారగర్వంతో.

"అదికాదు నాన్నా, నేనే, మరే, నేనే మల్లెపూలు కొనమన్నా నాన్నా......" అని కొంచెం ఆగింది దుఃఖంచేత మాటరాక. "చెప్పూ, కొనమనటం ఏమీ తప్పులేదు. అట్లా అనటానికి నీకు సర్వహక్కులూ ఉన్నాయి. ఊ - అంటే" అన్నాను నేను.

"కొనమంటే కొనలేదు నాన్నా" అని అది పూర్తి జేసింది.

ఫిర్యాదు విన్నతరువాత ఇది క్రిమినల్ కేసా, సివిల్ కేసా అని నాకు సందేహం కలిగింది. పూలు ఆస్తే కాబట్టి ఇది ఆస్తికి సంబంధించిన విషయంగా నిశ్చయించి సివిల్ లా ప్రకారం విచారించాలని తేల్చుకొన్నాను. ఆపళంగా, ముద్దాయి వంకతిరిగి "ఏమి! నీవు పూలు ఎందుకు కొనకపోవాలె? పిల్లల పూలకోసమని జీతంవచ్చినప్పుడు ప్రత్యేకంగా తీసి ఇచ్చిన రూపాయి ఏంజేశావు?" అని కొంచెము బొంగురుగొంతుకతో తీవిగా అనేశాను.



వాళ్ళమ్మను కోప్పడుతున్నానని మా అమ్మాయి అనుకొంది కాబోలు కొంచెం ధైర్యంగా "కొని ఇయ్యకపోతే నేను ఏడ్చాను నాన్నా" అన్నది. "పెర్ఫెక్ట్లి రైట్, నీ తప్పు ఏమీలేదు." అని అది ఇంకేదో చెప్పవస్తుంటే ఉండమ్మా ఇంతవరకు విచారిస్తాను అన్నాను.

న్యాయవిచారణలో సాక్షులు కావాలె. సాక్ష్యం క్రింద మా పెద్దఅమ్మాయిని తీసుకొన్నా—"ఏమే, అమ్మా! పూలుకొనమంటే అమ్మకొననిమాట నిజమేనటే" అన్నాను—"కొనలేదు నాన్నా" అని అది గట్టిగా అనేసింది.

అప్పుడు ముద్దాయి వైపుతిరిగి—"విన్నావుగదా, నీ మీద పెట్టబడినకేసు. బలమైన సాక్ష్యంకూడా, చదువుకొన్న (మా పెద్దఅమ్మాయి మూడోక్లాసు) లేడీ వలన నీకు వ్యతిరేకంగా ఉంది. ఏం జెపుతావు" అన్నాను, ప్రతిమాటాకూడా న్యాయమూర్తికి ఉచితమైన నొక్కులో ఉచ్చరిస్తూ.

ముద్దాయి జవాబు ఇయ్యక నవ్వింది. "నవ్వటం పనికిరాదు. ఆట్టే నవ్వితివా అంటే కంటెంప్టు అఫ్ కోర్టు క్రింద నీకు శిక్షను ఎక్కువ చేస్తాను. పూలుకొని పెట్టకపోవటం నిజమా కాదా చెప్పు," అని కొంచెంగర్జించాను.

"కొనిపెట్టకపోతే ఏంజేసిందో కనుక్కోండి" అని పెంకె జవాబు చెప్పింది. "అది వేరేసంగతి. తప్పు నీదని ఒప్పుకుంటావా?" అన్నాను.

"డబ్బులేక కొనలేదు" అని ముద్దాయి జవాబు విని నేను కొంచెం కోపంతెచ్చుకొని "నీకిచ్చిన డబ్బు ఏం జేశావు. ఆ రూపాయిపెట్టి అప్పుడే పూలుకొనేశావా!" అన్నాను, నిజంగా కోపంవచ్చినవాడిలాగే.

“ఏదో జేశాను. పోసీ కొనలేదు. ఇప్పుడేం”— అన్నది ఈ కోర్టులో ముద్దాయిగా నుంచున్న కాంతం —చాల్లే సరిగా జవాబులు చెప్పు. అని కాంతంతో పిల్లలు వినకుండా ప్రైవేట్ కెపాసిటీలో అని, ప్రకాశంగా “నువ్వు అట్టే మాట్లాడకు. పిల్లలు పూలుకొనమంటే కొనకపోవటం తప్పు నీది. నిన్ను కన్విక్టు చేసినాను. అన్నాను.

“ఏడిస్తే కొట్టింది నాన్నా” అని మాఅమ్మాయి తల్లి మీద నేరాలు కుప్పలు కుప్పలుగా పడేయటం సాగించింది.

“ఆ,! ఆ!, తప్పుడుదానా, ఎందుకు కొట్టానే? ఆ సంగతి చెప్పవేం” అన్నది కోపంగా కాంతం. పిల్ల మాట్లాడలేదు.

౨

మాకోర్టులో సంగతేమిటంటే మౌనము, నేరము చేసినట్లు అంగీకారసూచకము. కాబట్టి ఇదేదో చేస్తేనే వాళ్ళమ్మ కొట్టినట్లు స్పష్టము. ఇప్పుడు తల్లి ఫిర్యాది, కూతురు ముద్దాయి అయింది.

ఇపుడు నేను ముద్దాయితో, ‘ఏంజేశావే అమ్మా’ అన్నాను. మళ్ళా మాట్లాడలేదు చిన్నది.

“చూశారా! భడవా! మాట్లాడదు! దొంగ,! పరమ దొంగ! మాట్లాడదు!” అన్నది కాంతం.

“నీవు వూరికేతిట్టకు. అది వేరే నేరమవుతుంది. సంగతేమిటో చెప్పు” అన్నాను నేను విసుగుతో.

“ఏముంది? దీన్ని ముందుగదిలోపెట్టి బైటగొళ్ళెం పెట్టాను. తరువాత * * *”

“అగు అగు. నిన్ను గదిలోపెట్టి గొళ్ళెంపెట్టింది. అమ్మ” అన్నాను, “బైట గొళ్ళెం వేసింది నాన్నా” అని అది ఏడ్చింది.

“ఎందుకట్లా చేశావు?” అని నేను ప్రశ్నించాను.

“ఏం జేయమంటారు? పూలుకొనమని ఎగిరి నానా గోలాచేసి, పీకుచంపుతుంటే ఏంజేసేది? అసలు సంగతి వినరేం?” అన్నది కాంతం.

“వింటూ నుండు. ఒక్కొక్క—పొయింటే విచారించి తీర్పుఇస్తా” నన్నాను.

“తీర్పూ, జడ్జిమెంటూనూ, అవతల పనుంది. వెళ్ళిపోవాలె. మీకేమి?” అన్నది కాంతం.

“పోవటానికి వీలులేదు. కంటెంప్టు అఫ్ కోర్టుక్రింద ఛార్జి చేస్తాను. జాగ్రత్త: చివరదాకా అట్లానుండు. అయితే పిల్లను గదిలో పెట్టిగొళ్ళెం ఎందుకు వేశావు? అట్లా వేయటంతప్పు ఈ నేరాన్ని, ఇంగ్లీషులో రాంగుఫుల్ కన్ఫైన్మెంటు అంటారు. దీనికిశిక్ష, జరినామా ఆసెక చెపుతాను. కానీ నీవు చెప్పేదేమిటో చెప్పు” అన్నాను.

“అట్లా దాన్ని గదిలోపెట్టి గొళ్ళెంవేసి, చిన్నవాడు వంటఇంట్లో ఆడుకొంటూఉంటే వదిలేసి—పసిదానికి నీళ్ళుపోయటానికి దొడ్లోకివెళ్ళాను. కాసేపుండి ఇట్లా వచ్చి చూద్దునుగదా ఆ చిన్నవెధవ ఉడుకుతూ ఉడుకుతూ ఉన్న అన్నంలో బొగ్గులూ కచ్చికలూ పడేస్తున్నాడు. తవ్వెడుబియ్యపు అన్నం దగ్ధమైపోయింది. వాడ్ని నాలుగు బాదాను. ఇంతలో అబ్బాయి కెవ్వున కేకేశాడు. ఇట్లాబోయి చూద్దునుగదా, హాలులో పిల్లలందరూ గంతులేస్తూ గోలచేస్తున్నారు. విడిచి పడేసిపోయిన చీరఒకటి భగ్గునమండిపోతున్నది. ఇల్లు తగలడిపోయేది. ఎంతగోలో చూశారా? అపళంగా నేను నలుగురినీ నాలుగేశాను. అదిగో, ఆ చిన్నదే ఇంతపనిజేసింది. దాన్ని వళ్ళు పగలగొట్టాను. కాస్త పెద్దదాన్ని, అయినానని అయినా జ్ఞానంలేకుండా వీళ్ళతో కలిసినందుకు ఆ పెద్దదాన్ని, రెండు ఉతికాను. బట్టలు ఎందుకు తగలబెట్టిందో కనుక్కోండి ఆ చిన్నదాన్ని” అన్నది కాంతం.

“ఏమే అమ్మాయి” అంటే ఆ చిన్నది బెల్లంకొట్టిన రాయిలాగ ఊరుకొన్నది.

సరే చిన్నది ఏదోచేసిందని తేలింది. అయితే ఇల్లు తగలబెట్టాలని పిల్లల ఉద్దేశంకాదు. కాబట్టి నేరంలో ఉండే సగంబలం తగ్గింది. అమ్మాయిని “అయితే, అసలు నిప్పుపుల్ల ఎక్కడిదే? ఎవరు గీశారు? ఎవరు ముట్టించారు.” అని అడిగాను.

‘తమ్ముడు తెచ్చాడు నాన్నా’ అన్నది అమ్మాయి.

‘నిన్ను బైటకు తీసిందెవరు?’

'అక్కయ్య గౌన్లోంతీసి, దబ్బునరావే, అమ్మలేదు' అన్నది.

'నిప్పుపుల్ల గీచిందెవరు?'

'నేనే నాన్న, ఊరికే నేగీచి అక్కడ పారేశా నాన్నా'

'ఊరికేగీచి ఎక్కడ పారేశావు? చీరమీదా?'

'కాదు నాన్న. అక్కడే పారేశాను.'

'అక్కడ పారేస్తే, చీర ఎట్లా అంటుకుంది?'

'ఏమో నాన్న'

'మరి చీర ఎట్లా అంటుకుందే?'

'ఏమో, అదంతట అదే అంటుకుంది'

## 3

ఇట్లా ప్రశ్నోత్తరాలు జరిగినయి. ఇప్పుడు చిన్నది నేరస్తురాలా కాదా అని సందేహం. నిప్పుపుల్ల గీచి వేయటం చీర తగులబడటానికి కారణంలాగ కనబడుతున్నా అదేకారణం అని మనం నిశ్చయించకూడదు. కాబట్టి చిన్నది నేరస్తురాలని స్పష్టంగా నిశ్చయించ లేము. కాబట్టి పిల్లలు నేరమేమియు చేయలేదనే కోర్టువారి అభిప్రాయం.

ఇక తల్లిసంగతి. నిప్పుపుల్లలపెట్టె చేతిలో ఉండటం మూలాన అదే ఇంత పనిచేసి ఉంటుందని తల్లి అభిప్రాయపడి వాళ్ళను తలానాలుగు కొట్టటం ఎసాల్ట్ నేరము క్రిందికి వస్తుంది. వాళ్ళు ఏడ్చి నానాగోల చేసి ఉంటారు. అపుడు బ్రీచ్ ఆఫ్ డొమెస్టిక్ పీస్ జరిగింది. ఇదివరకే ముద్దాయిలైన నీపై రాంగ్ఫుల్ కన్ఫైన్మెంట్ కేసు ఉంది. పిల్లలు పూలకోసం ఇచ్చిన డబ్బును అపహరించావు. అదీకాక నీవు ఇటువంటి నేరములను తరుచూ చేస్తూఉండే ఓల్డ్ అఫెండర్ కాబట్టిన్నీ చేసిన నేరాలన్నీ కలిపి కన్సాలిడేటెడ్ స్టేట్మెంట్ ఒకటి తయారుజేసి తగిన శిక్షను అనుభవించటానికై నిన్ను సెషన్సుకు కమిట్ చేస్తున్నాను. సెషన్సు కోర్టుకు నీవుమాత్రం రావాలె. పిల్లలు రానక్కరలేదు. వారి విషయమై ఉన్న రికార్డు చాలు. అని తీర్పుజెప్పాను,

ఇక మాటలురాని ఇద్దరు పసిపిల్లలకేసులు ఉండిపోయినాయి. అయితే పసిదానికి పాలు, ఎడబిడ్డకు పిప్పరమెంటుబిళ్ళలూ దొరకటంచేత వాళ్ళు రాజీపడి తల్లి దగ్గరచేరారు. కాబట్టి కోర్టువారికి చేసేది ఏమీ లేక పోయింది.

## ౪

'రండర్రా - అన్నాలు పెడతాను అన్నది కాంతం' అప్పటికి పూర్తిగా చీకటిపడటంచేత. ఆరోజు జీలకర్ర వేసి కందిపచ్చడినూరి ఉంచటంచేత పిల్లలు ఎప్పుడు అన్నంతిందామా అని చూస్తున్నారు. ఈ మాట వినటంతోనే ఒక్క సారిలేచి తల్లివెంట వెళ్ళిపోయినారు.

కోర్టువారు ఒక్కరే మిగిలిపోయినారు. ముందున్న బడిపంతులు తలగుడ్డ వెక్కిరిస్తూ బల్లమీద ఉంది. మాసినలాంగుకోటు వంకెనె వేలాడుతున్నది. కాఫీ తాగినతరువాత అక్కడపెట్టిన వెండిగ్లాసు అక్కడే ఉంది నిర్లక్ష్యంగా దొర్లుతూ. దూరాన మబ్బులలో నుంచి బాలచంద్రుడు వెకిలినవ్వులు నవ్వుతున్నాడు. పిల్లలను ఇంత అన్డ్యుఇన్ఫ్లూయన్సుతో స్వాధీన పరచుకొని ప్రపంచంప్రకృతిఅంతా నన్నువెక్కిరించేటట్లు, హాస్యాస్పదమైన స్థితిలోకి నన్నుతీసికొచ్చి వదిలిపెట్టిన కాంతానికి సెషన్సులో కఠినశిక్ష విధించక మానను అని నిశ్చయించుకొన్నాను.

—మునిమాణిక్యం నరసింహారావు





శ్రీ మునిమాణిక్యం

మామయ్య వచ్చాడన్న సంతోషంతో పెందలకడే లేచారు పిల్లలంతా. వాళ్ళకంటే ముందే లేచింది కాంతం. నేను నిద్ర లేచేసరికి మావాడు రాధాయతో ముద్దులాడుతున్నాడు. "నీకెన్ని చేతులున్నాయిరా ?" అని వీడు అడగటం, "మూడు" అని వాడనటం, "కాళ్లు ?" అని అడిగితే "కాళ్లూ మూడే" అని మళ్లీ వాడు చెపటం, నేనువింటూ లేచాను.

"బావా, వీడికి మూడు చెతులూ, మూడు కాళ్లూ ఉన్నయిట విన్నావా ?" అని మావాడు అన్నాడు. వాడికి అంకెల్లో మూడు అనేమాట తప్ప ఇంకొకటి రాదు ?" అని సమాధానం చెప్పి మేడదిగి వెడదాము అనుకొంటూండంగనే పద్మతల్లి లేచింది, పెద్దగా ఏడుస్తూ. దాన్ని తీసికెళ్లి తల్లికి ఒప్పగించి ముఖం కడుక్కొని పైకొచ్చి కూర్చున్నాను. మావాడూ వాడివెంట వచ్చిన దాసూ కూడా అంతకముందే స్నానం అవీ పూర్తి చేసుకొని కూర్చుని ఉన్నారు. ఏదో మాట్లాడుకొంటున్నాము. ఇంతలో మేడ విరిగి క్రింద పడ్డంత శబ్దం అయింది. మావాడూ దాసూ, తెల్లపోయి చూస్తున్నారు. "ఏమిటో మీద పడేసుకొని ఉంటారు" అని నేను ఒక్క దూకులో క్రిందికెళ్లాను. నావెంట మావాడు ఆతనివెంట దాసు, పడమటింట్లోంచి కాంతం పక్క యింట్లోంచి పెద్దపిల్లా, సావిట్లోనుంచి సుశీ-చంటిదీ, అంతా వచ్చారు. పద్మ, రాధాయ, బిక్కముఖాలతో పడిపోయిన సైకిల్ ముందు నుంచున్నారు, పది తలలతో చచ్చిపడున్న రావణుని ముందు నించున్న రామ లక్ష్మణులలాగ.

రాధాయ "పాప పడేశింది నాన్నా" అన్నాడు. పసిది "అన్నాయ" అని ఒక్క బిక్కచూపులో తన అమాయకత్వాన్ని నిర్దోషిత్వాన్ని నిరూపించుకొంది. ఇంకొక క్షణంలో ఇద్దరూ బావురు మన్నారు. ఇదంతా చూస్తున్న దాసు, ఒక చిన్న నాటకం చూస్తున్నట్టు ఆశ్చర్యపోతున్నాడు. "నిజంగా ఆ సైకిల్ వాళ్లమీద పడితే ! ఇంకేమన్నా ఉందా" అని అంతా అనుకొన్నాము.

"భగవంతుడే చూస్తుంటాడు వాళ్లని" అన్నది ఆవిడ రెండు కళ్లూ తేలేసి పైకిచూస్తూ.

"అబ్బ ! వీళ్లతో..."

అనినేను పళ్లు కొరుకుతూ ఆమనిషి వంక చూస్తుంటే మావాడు "పిల్లలూ మరి, పిల్లలను ఏమనంటె ఏంలాభం" అని అంటూ తన అక్కపిల్లలను వెనకేసు కొచ్చాడు.

## ౨

సరే అయిపోయింది ఆసీనన్. మేంముగ్గురం పైకెళ్లాం. పిల్లలు ఆడుకొంటానికి వెళ్లారు. ఆమనిషి వంట ఇంట్లోకి. వేరు వేరు దారులో యక్జిట్.

నేను బజారుకు వెడదామనే ఉద్దేశంతో గదిలోకి వెళ్లి బీరువాలోనుంచి మంచి బట్టలు తీసుకొని వేసుకొంటున్నాను. రాధాయ కామాలు కెవ్వన కేకేశాడు. పెద్దపులో, భయంకర పిశాచమో కనపడితే వెయ్యతగిన కేక అది. దాసు హడలిపోయి, తెల్లబడ్డాడు. మాబావ మరిది చూపులన్నీ కొశ్చెన్ మార్కులు (Qnestion marks) అయిపోయినై.

యీనాడు క్రిందికి పరుగెత్తాడు. [illegible] న్నాడు. ఇంతలో నేనొచ్చి, "[illegible], [illegible] కింకా ప్రథమ సంతానం కలుగలేదని తోస్తుంది" అన్నాను. "ఏంచేత అట్లా ఊహించారు" అన్నాడతడు ఖంగారు పడుతూ. నేనవ్వి ఊరుకొన్నాను- అంతా మళ్లీ క్రిందికెళ్లాము. క్లోరోఫారం ఇయ్యకుండా ఆపరేషన్ చేస్తుంటే, పేషంటు ఎట్లా ఏడుస్తాడో, అట్లా ఏడుస్తున్నాడు రాధాయి. పక్క భాగంలో వాళ్ల కుర్రాడూ మావాడూ, ఒక్క ఇనపమేకు కోసం తగూ అది. "వాడి మేకు వాడికిచ్చేయరా" అంటే మా రాధాయ వినడు. "అబ్బాయీ రవ్వంత సేపుండు. నీమేకు నీకిచ్చేస్తాం" అంటే వాడు వినడు. ఇంతలో నే-



అబ్బాయి తల్లివచ్చి తన పిల్లాడ్ని ఎత్తుకొని "వాడి దగ్గరకు పోవద్దంటే నీకు బుద్ధి ఉందీ" అని వాడ్ని బుగ్గలు బుగ్గలు పొడిచి "ఈ కొంపలో బతకటం కష్టంగా ఉందమ్మా చేతులో చీపురుపుల్లైనా నిలవ నీడు. రయ్యిన వచ్చి గద్దతన్నుకు పోయినట్లు తన్నుకు పోతాడు" అని విసుక్కొంటూ దొడ్లోకి వెళ్లిపోయింది. మా ఆవిడ [illegible] అక్కడ ఉండగేమి, [illegible] అందుకోంది. [illegible] నిమిషానికి కమిలియాన్ కు మల్లె రంగులు మారుస్తున్నాడు.

## 3

అప్పటికే ఎనిమిది గంట లవటం మూలాన మేము ముగ్గురం కాఫీ హోటలుకు వెళదామనుకొని సిద్ధమైనాము. కనిపెట్టింది కాంతం మాసంగతి.

"ఒరే! అబ్బాయి, ఇంట్లో ఇడ్లీ కాఫీ చేశాను. ఎక్కడికీ వెళ్లకండేం" అన్నాది ఆమెగారు.

"పిల్లలకు పెడుదూ. మేము అట్లా వెళ్లొస్తాము" అన్నాను నేను.

"పోనీ, బావా, ఇక్కడే కానిద్దాం ఆకాస్త మంచి మాట" అని మావాడన్నాడు. అక్కయ్య యందుండే అభిమానంతో.

"ఇక్కడే కానీండి హోమ్లీగా ఉంటుంది." అన్నాడు దాసు అభిమానంతో.

ఇంకేం ఉండాలి సొచ్చింది. ఇంకో క్షణంలో పీటల మీద కూర్చున్నాం. వెండి పళ్లాలతో ఇడ్లీ అల్లపు పచ్చళ్లు, వెండి గ్లాసులతో మంచినీళ్లు ఉండటం చూచి పాపం దాసు మురిసి పోయినాడు.

"ఎట్లాగయినా మన ఇంట్లో హోమ్లీగా ఉంటుంది" బావా అన్నాడు మా ఆవిడ తమ్ముడు.

"వెధవ ఎంగిలి పళ్లాలూను, అంటుగ్లాసులూను అక్కడ" అని దాసు వత్తాసి పలికేడు.

సరే నని ఇడ్లీలు తినడం ఆరంభించాము. వకిళ్ల ముఖాలు ఒకరు చూచుకొన్నాము.

"ఏవస్తువైనా, నమిలి తినటం మంచిదని" నే నొక ఆరోగ్య సూత్రం వల్లించాను.

"సాధ్యం అయితే గద" అన్నాడు దాసు నవ్వుతో. "హోటల్ కాఫీ టిఫిన్సు తినటం అలవాటు తప్పింది మనకు" అని మావాడు డిఫెన్సు చెప్పాడు.

ఇంతలోకే కాఫీ వచ్చింది వెండి గిన్నెలలో.

దాసు కాఫీరంగు చూసేచూడటం తోనే నిరాశ చెందాడు. మావాడు సాహసించి తాగాడు గాని వాడి ముఖం మటుకు ఆముదం త్రాగేవాడి ముఖం లాగఉంది. నేను కళ్లుమూసుకొని గ్లాసెడు కాఫీ నోట్లో పోసుకొన్నాను. దాసు ముక్కుకూడా మూసుకొని మందు లాగ పుచ్చుకొన్నాడు. అంతా లేస్తుంటే కాంతం, "అయ్యో, ఇంకాస్త పుచ్చుకోకుండా లేస్తున్నారేం! బాగుండలేదా ఏమిటి?" అన్నది. నేను ఏమీ మాట్లాడలేదు కాని దాసుమటుకు "దివ్యంగా ఉందండీ, అమృతం చాలు" నంటూ, కాస్త వక్కపొడి చప్పున అడిగి పుచ్చుకొని నోట్లో వేసుకొని మేడపైకి వెళ్లిపోయినాడు.

## ౪

మేము పైకెళ్లే టప్పటికి గదంతా గల గల్లాడు తున్నది పిల్లలతో. చిన్న చిన్న పేడబొమ్మలూ లక్క చిట్లూ, తాటాకు బొమ్మలూ, గుడ్డ పేలికలూ, గాజు పెంకులూ, రంగు కాగితాలూ, సిగిరెట్టు పెట్టలూ, గదినిండా చిందర వందరగా ఉన్నాయి. పెద్దమనిషిపాపం ఏమనుకున్నాడో అని నాకు నిజంగా, తలవంపులైంది. పెద్ద దాన్ని పిలిచి అవన్నీ తీసేయించి చాపవేసి కూర్చోబెట్టాను. పదిగంటలదాకా ఏదో మాట్లాడుకొంటూనే ఉన్నాము కాని కింద కేకలూ బొబ్బలూ ఏడ్పులూ, నవ్వులూ! ఓ. అల్లరి. ప్రతి అయిదు నిమిషాలకూ నేను లేచి వెళ్లి, ఎవరినో ఒకర్ని, ఏడుస్తున్న పిల్లను ఎత్తుకు రావటం! సముదాయించి మళ్లీ పంపటం! ఇట్లా గడిచింది.

పది గంటలకల్లా, అన్నానికి రావలసిందని కబురొచ్చింది. స్నానానికి లేచాం ముందు. పరాయివాడ్ని గౌరవించాలని దాసుగారిని పంపాము స్నానం చెయ్యమని.

గంగాళంలో నీళ్లు, చెంబు, సబ్బు బిళ్లా ఉన్నాయి గదా అని తృప్తి పొందాను. కాని దాసుగారు గంగాళం వంకచూసి, "గుడ్డ ఇవ్వండండీ. నే నూతికాడే స్నానం చేస్తానన్నాడు. "వద్దండీ, నీళ్లు తోడుకోటం కష్టం ఈ గుంటూరు లోతుబావుల్లో నుంచి. ఆనీళ్లు పోసుకోండి" అని అన్నాను. ఆయన పాపం ఏమనలేక "వద్దండీ నేను తోడుకోగలను" అంటూ బయలుదేరాడు. ఇట్లావెళ్లి చూద్దునుగదా ఆ నీళ్లనిండా బురద పైన బొగ్గులూ తేలుతున్నాయి.

"ఇదేమిటి కాంతం. స్నానానికి ఇల్లాంటి నీళ్లు పెట్టావేం?"

అంటే ఆవిడొచ్చి చూచి "అచిన్నదాని పని నేనేం జేసేది?" అని విసుగ్గని, నవ్వుతూ వెళ్లిపోయింది.

పీటలూ వెండి కంచాలూ వెండి చెంబులూ మటుకు దర్జాగా పెట్టింది కాంతం. అతిథిసత్కారం దర్జాగానే చేస్తున్నది. కమ్మని భోజనంతో కాఫీ పట్ల జరిగిన అవమానం పోతుందని ఆలోచించుకుంటూ నేనూ కూర్చున్నాను.

"అన్నంలోకి ఏమిచేశావు?" అన్నాను, నాకేమి తెలియనట్లూ, మామూలుగానే రెండు కూరలూ మూడు పచ్చళ్లూ పులుసూ చారూతో రోజూ జరిగి పోతున్నదని ఆతడు అభిప్రాయ పడాలనీ.

"వడ్డిస్తున్నాగా," అని ఊరుకొంది కాంతం. విస్తరి నిండుగా రెండు కూరలూ పప్పూ పచ్చడి పులుసూ చేసింది. అతిథి వచ్చాడని క్షీరాన్నం కూడాను. అతిథి సత్కారం నిండుగా జరుగుతున్నదని నాకూ సంతోషం వేసింది "కానీండి" అన్నాను.

"పప్పు ఏదో కొద్దిగా కాటుపోయి నట్లుందేమి కాంతం" అన్నాను నేనే ముందుగా. "అవును కందులు వేయిస్తుంటే పసిది నానా గోలచేసింది ఆగోలలో కందులు ముదర వేగినయి కొద్దిగా" అని జవాబు చెప్పింది కాంతం.

దాసుగారు పప్పుఅన్నం ఎట్లాగో తిసేసి కూర కలుపుకొని తింటున్నాడు. అతిథి తృప్తిని ఆశించిన నేను అది చూచి ఆనందిస్తూన్నా. ఇంతలో దాసు తినటం ఆపి

“ఉప్పు ఎట్లా ఇస్తున్నారండీ ఇప్పుడు” అన్నాను. “ఏం ఏమంటి” అన్నది కాంతం. మావాడు మాత్రం రుచిమూచి చిరునవ్వు నవ్వాడు. ఇట్లా నోట్లో పెట్టుకొని చూద్దును గదా ఉప్పు కషాయం అది.

పళ్ళు మండిపోయింది. పాపం ఆవిడ తెల్లపోయింది. “ఆరాధిగాడ్ని లాక్కురా ఎక్కడున్నాడో” అన్నాను. వాడ్ని తీసుకొచ్చి వాడి చెయ్యి నాకి చూశాను. ఉప్పుగా ఉంది. “ఉప్పు ఈ గిన్నెలో వేశావు నాన్నా” అని మెల్లగా అడిగాను కోప్పడకుండా. “ఈ బుట్టలో ఉప్పే నేనేచా నాన్నా” అని గర్వంగా చెప్పాడు.

“వాడి కెప్పుడూ వంట ఇంట్లోనే పని. తల్లితో పాటు ప్రతి పనీ చేస్తుంటాడు. వాడి పనే ఇది” అని తల్లి విసుక్కుంది. ఏంజేస్తాం ?

“ఆ అన్నం వదిలేశెయ్యండి” అని పులుసు తెచ్చింది కాంతం. కడుపు దహించుకు పోతుందో ఏమో పాపం దాసు రెండు కీట్ల అన్నం ఒక్కసారిగా పులుసులో కలిపాడు. దాంతో సగం తిని 'రెండు ముక్కలుంటే వెయ్యండి' అన్నాడు పాపం. ఆవిడ సంతోషంతో గంటె నిండా తీసి వేసింది ఆప్యాయంగా.

మేమూ పులుసుతోనే తింటున్నాము. కాని మా వాడు ఏవో ఏరి విస్తర్లోకిందకు తోశెయ్యటం చూశాను. ఇంతలో దాసుగారు “ఇవ్వేమి టండోయి” అని రెండు బొగ్గులు ఏరిబైట పడేశాడు. కాంతం పాపం, చిన్న పుచ్చుకొని “అన్నీ అన్నిగానే ఉన్నాయి కాబోలు” అని విచారపడ్డది. దాసు “దానికేం లెండి. పులుసు దివ్యంగా ఉందని” మెచ్చుకొన్నాడు.

“ఎండాకాలం కావటంచేత మజ్జిగ పసి లేదు” అని క్షమాపణ చెబుతూ ఆవిడ మజ్జిగ వడ్డించింది. భోజనం పూర్తిచేసి లేచాము.

ఆ సాయింత్రం ఆరు గంటలకు పోవాలసిన దాసు వెంటనే వెడతానంటూ పట్టు పట్టాడు. ఇప్పుడేం తొందరని కాసేపు నిద్రపోయి భుక్తాయాసం తీర్చుకొని, ఫలాహారం చేసి 'కృతజ్ఞుణ్ణని కాంతంతో చెప్పినా వినక బజారులో పనుందంటూ వంటనే వెళ్ళిపోయినాడు.

నేనింటికి వెళ్ళి—“వెళ్ళిపోయినాడు” అన్నాను. “అయ్యో— పెద్దమనిషి వచ్చాడని, పప్పు నానబోశాను ఉండమనక పోయినారా” అన్నది.

“తిన్నది చాలు. ఇక మనింటికీ జన్మంలో రాడు”

“రాకపోతేమానె. ఈ మాత్రానికే. పిల్లలు గల ఇల్లని తెలియక్కరలా” అన్నది కాంతం గర్వంగా

---



---

# పాతకలాలు : కొత్త పేజీలు

నిన్న వచ్చిన జీతంలో బాకీలుపోగా ఇక పాతిక రూపాయలే మిగిలాయి. కాఫీ హోటలులో బాకీ పదిరూపాయలు కాంతానికి తెలియకుండా ఎలా ఇవ్వడం ? ఏ పత్రికకన్నా ఓ కథరాసి ఆ బాకీ తీర్చాలి.

గుమ్మంలోకి రాకముందే వినిపించింది ఇంట్లో అల్లరి. బుడుగు, బూరాల కీచుశబ్దం, ఈలలు, ఢమఢమలాడే బండి మోత అన్నీను. తిరణాల్లోను, తీర్థాలలో వింటాము అల్లాంటి మోతలు.

కురిపించటం సాగించాడు. చిన్నదాని చేతిలోను కోతేవుంది. పెద్దపిల్లాడు ఢమఢమా బండి లాగుతున్నాడు. సుశీ – చెవులు గింగురుమనేట్లు ఈల ఊదుతున్నది. అందరూ తలో కోతిని తీసుకొచ్చి నా ఎదట నించున్నారు. ఈ వానర మూకకి అధిపతి అయిన కాంతం మేడ మెట్ల నానుకుని నుంచున్నది వాళ్ళ వెనక.

"ఎక్కడివే ఈ కోతులన్నీ ?"

"మనవే నాన్నా" అన్నాడు పెద్ద

## ● మునిమాణిక్యం నరసింహారావు

# కాంతం కైఫీయత్

ఏమిటా సంగతి అనుకుంటూ ఇంట్లో కాలెట్టేసరికి చిన్నవెధవ చేతిలో చెక్కబొమ్మను ఆడిస్తూ పరుగెత్తుకుంటూ వచ్చి "కోతినాన్న కోతి" అని దాన్ని పైకి కిందికీలాగి ఆడిస్తూ, బాగుందా "నాన్నా మంచి కోతి నాన్నా" అని ఆ బొమ్మను గురించి ప్రశంసా వాక్యాలు

బ్బాయి. మనకన్ని కోతులున్నావా ?

"ఉన్నాయి నాన్నా అమ్మ సంపాదించింది."

"నేనురా ? ఓరి వెధవా నే నెక్కడ సంపాదించానురా ? మీరే కొనుక్కొని" అన్నది వాళ్ళమ్మ.

"ఏమి కాంతం ఈ కోతులన్నీ

నీ సంపాదనే ?"

"సంపాదనంతా మీ దే క ద. నాదే ముంది ?" అన్నది కాం తం కొంచెం ముఖం ముడుముడుని, పొంగే నవ్వును అణుచుకుని, నేనూ నవ్వక తప్పింది కాదు.

ఆరోజు సాయంత్రం ఒక్క టీ మాత్రం గుక్కెడు తాగాను. డబ్బుఖర్చు తగ్గించాలనే ఉద్దేశంతో. నా తాపత్రయం ఇల్లా ఉంటే కాంతం ఈ కోరులకై ఎంత పాటు చేసిందో అని మనసులో కొంత బాధగావున్నా పిల్లలఆటల్నిచూసి మురిసిపోతున్నకాంతాన్ని అప్పడేమన్నా అంటే చిన్న బుచ్చుకుంటుందని అప్ప టికే మాట్లాడక ఊరుకున్నా. ఇంతలో.. పంతగాన్తోంది నాన్నా మనింటకేఅన్నాడు పెద్దబ్బాయి. వస్తే ఏంరా అన్నా ? పంత గొస్తే....ఇవన్నీ ఉంటాలె నాన్నా. ఆ రోజున పాడాలె. నీకు పాటలొచ్చా నాన్నా" అన్నాడు. నాకేం రావుఅన్నాను. ఏమని పాడాలిరా? అన్నది వాళ్ళమ్మ.

నీవు కూడా పా డ లే వా నాన్నా ? నేనెందుకులే నీవు-మీ అమ్మ పాడండి అన్నా. ఎబ్బే ! ఆ డా ళ్ళు పాడ తారా ? మగాళ్ళు పా డ తా రు నాన్నా అన్నాడు మా వాడు ఛాతీ విరిచిమొగాణ్ణి అన్న గర్వం అంతా రొమ్మున అదిమి పట్టి.

ఏమని పాడాలో చెప్పరా మీనాన్నకి. అన్నది ఆవిడ దొంగ నవ్వు నవ్వుతూ. నాన్నా ! ఇది పట్టుకుని "ధరచిమ్మా చనమై అంటాను — నువ్వు అను నాన్నా నేనన్నట్టు" సరే "ధరసింహాసనమై" ఇంకేమి అనాలిరా ? చెపుతా నాన్నా — ధరసింహాసనమై లభంగు కొదుకై —— అను నాన్నా. ఛా! వెధవా. ఎవరు చెప్పా రురా నీకీ పాట ?

మాస్టారు చెప్పారు నాన్నా. బడ్లో మంచి పాటలు చెబుతారు. వదిలించి గొడుగై ——

అది కాదురా తమ్ముడూ "విధించి" అనాలిరా.అని పాపె అక్కయ్య తప్పుదిద్ది శబ్ద రూపం తెలిసిన దానికి మల్లే.

వాళ్ళమ్మ ఒకటే నవ్వడం....చిన్నది గంతులేయడమున్నూ. సుశీలలగింగు సి మనేట్టు ఊదేసింది. చిన్నాడు బ ం డి లాగాడు డమడమ మని.

చెపులు గింగురుమన్నాయి. అబ్బా ! ఏమి మోత, కాసేపు ఊరుకొండే అని అరిచాను. ఎవరు నామాట వినిపించు కునేది ? ఇంతకూ ఆవిడ దగ్గరుంది ఏమున్నా, ఎందుకు కొనియ్యాలె ఇవ్వ న్నీనూ? రాని ఆనెక్కు చెపుతా ఆవిడ సంగతి, అనుకుని మేడపైకి వెళ్ళి పోయినాను. ఇంకోగంటకు మామూలుగా భోంచేసి చదువుకుంటూ కూర్చున్నా ఆవిడ రాగానే గట్టిగా చీవాట్లెట్టాలని దృఢంగా నిశ్చయించుకుని.

రాత్రి తొమ్మిది కొట్టింది గడియారం ఠాంగ్-ఠాంగ్ మని. అప్పుడే మాఆవిడ



కాళ్ళ అందెలు  ఘల్లుఘల్లు మన్నాయి. తలెత్తి చూద్దునుగదా. ఎదుట నుంచు న్నది ఓ చేత్తో వెంకిబెంబు, మరో చేత్తో జిలేబీల పళ్ళెము పట్టుకుని, మా ఆవిడ కొత్తచీరతో.

"ఎక్కడిదీ కొత్తచీర ?" అన్నాను చూసీచూడ్డంతో. తెల్లపూల గులాబి రంగు సిల్కుచీర నే నెప్పుడూ కొనలేదు మరి.

కొంతం తలొంచుకుని చీర కుచ్చెళ్ళు సర్దుకుంటూ – ఎక్కడిదేవిటండీ? నాదే. బాగుందికదూ! అన్నది నేను సంతోషించా లన్నట్లు గంపెడాశతో.

కొనేసింది గామోసు  ఇంటి ఖర్చుల కోసం దాచిన డబ్బెట్టి! గుండెలో రాయి పడ్డది. సరదాపడి కొనుక్కుని మహ దానంధంతో నావంక చూస్తున్న మనిషి మనసు నొప్పించడం అన్యాయమే. కాని ఏం జెయ్యనూ. తప్పిందికాదు. అందుకని ముఖాన్ని ముడుచుకుని–

"బాగుండటం మాట అలావుంచు. ఎప్పుడు కొన్నారండీ చీర" అన్నాను బొంగురుగా. "అప్పుడే వచ్చినట్టుందే మహారాజులుంగారికి కోపమూ !" అన్నది పదునుగా నూరి సానబెట్టిన చిరునవ్వును నాపై ప్రయోగిస్తూ.

ఎప్పుడు కొన్నావు? ఎంత? అన్నాను అర్ధనిమీలిత నేత్రాలతో ఆ చిరునవ్వును ఆవతలకి తోసేస్తూ.

మధ్యాహ్నం....ఇరవై రెండు రూపా యలు అన్నది ఎదుటి అద్దంలోకి చూస్తూ కుచ్చెళ్ళు సర్దుకుంటూ.

ఆ కోతులకూ ? అన్నాను అంకెలు కూడుకుంటూ.

అవెంతలెండి. రెండుమూడు రూపా యలే అన్నది తేలిగ్గా. ఎక్కడదీ ఇవన్నీ కొంటానికి డబ్బు నీకు ? అప్ప టికి నా మనసులో బాధ చూపుల్లో కెక్కింది.

మనదే ! అన్నది ఆవిడ మళ్ళీ నమ్మ కంగా.

అంటే....నేను నీకు ఇవ్వలేదే" అన్నాను ప్రశ్నార్థకంగా చూస్తూ. ప్రత్యేకం యివ్వాలేవిటండీ– పెట్టెలోంచి తీశాను అంటూంటే కళ్ళలో తారకలు తళుక్కుమని మెరిసినవి.

నన్ను అడక్కుండానే ! అన్నా ఆశ్చర్యంతో. అడగాలా ఏవిటండీ అంటూ దగ్గరగావచ్చి పూమాలవంటి తన రెండు చేతులూ నా బుజాలపై వేసి ముఖంలో ముఖంపెట్టి నవ్వింది. నేను నవ్వలేదు. నేను డబ్బు తేలేక నానా ఇబ్బందీ పడుతోంటే పాతికరూపాయలు ఒక్కసారి మాయంచేసిందనే కోపంతో "చాల్లేఅలా వుండు – చెబుతాను – ఇవాళ నాకు చాలా కోపంగా వుంది సుమీ అన్నాను వినీ వినపడని సణుగుడుగా. ఓయబ్బ. ఇంత మాత్రానికే కోపమెందుకండీ ? అంటూ ముసిముసిగా నవ్వుతూ ముందుకిజరిగింది "అలా నవ్వినా నా కోపం పోదు. నవ్వేటప్పుడు నవ్వాలెగాని–ఎప్పుడుకితే అప్పుడదే పనా ? నా మనసు కనిపెట్టాలె అన్నాను. ఆవిడ మనసు కష్టం కలిగితే కలగనిమ్మనుకుని.

నవ్వటం ఆపి ముఖం మల్లె మొగ్గలా ముడిచి అన్నది——ఏం జేశాననీ మీకంత కోపం పిల్లలేడిస్తే అవ్వేవోకొన్నానూ నేనేమో ఈ చీర కొనుక్కున్నాను-— ఎన్నాళ్ళబట్టో కాపరానికొచ్చిన కొత్తలో నుండీ అనుకుంటూ గులాబీరంగు చీర కొనుక్కోవాలనీ——

ఔనౌను. ఇప్పుడదంతా ఎందుకు—— ఇక నెలంతా ఎలా జరగడం?

గడవక ఆగదులెద్దురూ. చూశారూ.... ఈ రంగు ఎలవదట గట్టిరంగు. పూలుచూశారూ :- ఎంచక్క ఉన్నాయో అన్నది అద్దంలోకి చూస్తూనే.

అయితే ఉన్న డబ్బంతా కోతులకు ఖర్చయిందన్నమాట – ఇక ఈ నెలంతా తలకిగోక్కుంటూ కూర్చోవలె.అంతేనా? అన్నాను విసుగ్గా.

ఏం మాటలండీ అవీ ! అంతా కోతులకే ఐందేం ? పిల్లలు ఆడుకుంటారని ఓ రెండు రూపాయలకు కొన్నాను అంతేగా ?

మరి చీర నీ వాక్కుదానికే కొనుక్కున్నావేం? ఇంకెవరికి కొనమంటారు? ఏమిటండీ బుద్ధమూతి పెట్టుకుని అల్లా కూచున్నారు ?

ఏమిటి చెయ్యమంటావు ? సంతోషంగా వుండమంటాను.

ఆ ! పాతిక రూపాయలు ఇస్తేసరి.

రూపాయలు కాకపోతే అంత విలువైంది మరోటి ఇస్తేనో–అంటూ కాంతం నా వెనక్కు వచ్చి రెండుచేతులూ కుర్చీ మీద వేసి ముందుకి వంగింది.

అహ. అలా కుదరదు. నాకు రూపాయలు రూపాయలుగా కావాలె దానికేం భాగ్యం అల్లాగే ఇస్తానూ అన్నది కొంటెగా చూస్తూ.

ఎల్లా ఇస్తావు మీ వాళ్ళ దగ్గర్నుంచి ఏమన్నా....?

అబ్బే మళ్ళీ జీతంరాదూ అప్పుడూ !

నా జేబులోంచి తీసి నాకే ఇస్తావూ ? ఘనకార్యం చేస్తావు. ఇవ్వాళ నీవుచేసిన పని నాకు చాలా కష్టంగా ఉంది సుమీ.

అత్యవసరమైన పనికికాకుండా డబ్బు ఖర్చుచేయ కూడదనే నియమం అలా వుంచి—నాతో చెప్పకుండా డబ్బు పెట్టె లోంచి తీయడం ఎంత తప్పు?

మనదే కదండీ—అంటూ నా క్రాపును సరిచేస్తు ప్రక్కగా కూర్చున్నది కాంతం. దాంతో ఇందాకటి కోపవూ, మనసులో కష్టమూ తగ్గిపోయినయి. పోనీలే అని పించింది. ఆ ముదురురంగు చిలుకచీర మెరుస్తున్న నీలి కేశబంధం మనోహ రంగా వున్నప్పుడు కోపమెలా నిలుస్తుంది!

మనదై తేమటుకు? ఇద్దరం ఆలో చించి సాధక బాధకాలు చూసుకుని ఖర్చు చేయాలిగాని, నీ యిష్టం వచ్చి నట్లు నీవు ఖర్చుచేస్తే ఎట్లా గడవటం?

మీరు నాతోచెప్పి ఖర్చు చేస్తున్నారా?

చెప్పకపోయినా సంసారానికే ఖర్చు చేస్తున్నాను.

నేనూ అంతేనండి. ఇంకో విధంగా పాడు చేస్తున్నాననుకోకండి.

మీరు చేసే వ్యయమంతా సంసార సౌఖ్యానికేనని ఎట్లా అనుకుంటున్నారో అట్లాగే చీరలు రెవికలు, ఆటవస్తువులూ కొని పిల్లలూ నేను సంతోషిస్తుంటే మీ కానందం కాదండీ? నేను అందంగా కనుపించడం మీ అనందం కోసమే! ఈ మాత్రం తెలియదూ? అన్నది చెమ్మగిలిన కనులతో.

పోనీ చీరకొంటే కొన్నావు—ఆ కోతు లెందుకూ? డబ్బు దండగ. ముద్దు మురిపెం వుంటద్దూ. పిల్లలు ఎంత సంతోషించారో మీరూ చూశారుగా.

అవును గాని అది అలావుంచు నీవు నాతో చెప్పకుండా డబ్బు తీయడం దొంగతనం. దొంగతనమా.... మీ డబ్బు మీరు తీసుకుంటే దొంగతనమైతే నాదీ దొంగతనమే.

నేను సంపాదిస్తున్నాను.... అన్నాను గర్వంగా.

మీరు సంపాదించడం నేను ఖర్చు పెట్టడానికే అన్నది కాంతం దృఢంగా. ఔనౌను. మహాగొప్ప సిద్ధాంతం. సాయిబు సంపాదనంతా బూబమ్మ కుట్టు పోగులకే కద బాగుంది. ఇట్లాగు అంటే— ఇట్లా భర్తనడక్కుండా భార్య డబ్బును దొరల సంఘంలో లేమికూడదు. తీస్తే? ఆ తీస్తే? చెప్పండి ఆ తీస్తాను. తీస్తే? యింకేముంది. ఆరోజుతోవారి దాంపత్యం చెల్లు. ఎవరి దారి వారిదే, వెళ్ళిపోడమే! ఆ నిస్సందేహంగా. విడాకులు పుచ్చుకుని ఎవరి దారిని వారు వెళ్ళిపోవడమే. పోమే వాళ్ళుపోక ఆ ఆకులు పుచ్చుకోపడ మేమిటే? ఆకులుకావవి. విడాకులు, అంటే డైవోర్సు. డైవోర్సు అంతే.

చచ్చాం. నీ కెల్లా చెప్పడం.

'చెప్పడమే మీ వృత్తి కదా. ఈ మాత్రం చెప్పలేరూ.

అదివేరు. బళ్ళో కుర్రాళ్ళకి తెలిసీ తెలియకుండా పెద్ద ఇంగ్లీషు మాటలు

వాడి హడలకొట్టేస్తే మళ్ళీ నోరెత్తరు. నీకు తెలుగులో చెప్పడం కష్టం. డైవోర్సుఅంటే భార్యా భర్తలకి పొత్తు కుదరనప్పుడు వారు కోర్టులో తమ దాంపత్యాన్ని విచ్ఛేదం చేసుకుంటారు.

సంబంధం తెంచుకుంటారన్నమాట.

ఆ అవీ.

తెంచుకుంటే తెగిపోతుందీ వాళ్ళ దాంపత్యం !

మహారాజులాగ ఠకీమని తెగుతుంది. నిమిషంలో....

పిల్లలుంటే ? వాళ్ళకేదో ఏర్పాటు – అంటే ఏ ఆసుపత్రికో పిల్లలను పెంచే సంస్థకో ఇచ్చేస్తారు.

ఓరి వీళ్ళ అమ్మకడుపు మాడ–ఎంత విడ్డూరం. ఆడదికూడా కోపంవస్తే విడాకులిస్తుందన్నమాట భర్తకి. ఓ భర్తనీ, పిల్లలనీ నిక్షేపం లాటి సంసారాన్ని వదిలేస్తుందేం ? వాళ్ళలో ఆ పని తప్పుగా వుండదు అంతేగదండి !

"అదీ సంగతి."

వాళ్ళ దుంపదెగిరి. ఇక నాకు చెప్పకండి.

అల్లాకాదు. మనము వాళ్ళ వద్దనుంచి కొన్ని విషయాలు నేర్చవలసి వున్నది. ఇప్పుడు చూశావు. ఇల్లా విడాకులివ్వడం మూలాన ఆడదానికి స్వేచ్ఛ ఏర్పడుతుంది. అదీ లేకపోతే భర్తతో ఇష్టం లేకపోయినా కాపరం చెయ్యాలె. అంటే– నీచమైన దానిసతన మన్నమాట. ఆగండి ఇక చాలు. అన్నది ముఖం చిట్లించి.

ఉండు మరి కొంసంటావిను. ఇష్టం లేనప్పుడు వదిలేసి—తాడు తెంచుకుని అనండి–అన్నది ఈసడింపుగా.

అదేలే వాళ్ళకి తాడుండదు. అట్లా వెళ్ళిపోయిన ఆడది ఆత్మగౌరవాన్ని వ్యక్తిత్వాన్ని సాధిస్తున్నది.

దాని నెత్తి లెండి..ఇక ఊరుకోండి. మన పురాణాల్లో ఎవరికీ ఇటువంటిది లేదు. ఏదో కొట్టినా తిట్టినా భర్తనే నమ్ముకోవడం తప్ప.

ఆ విషయాలు ఆదర్శాలు పాతవి. ఆ కాలం వేరు. నీవు ఈ కాలానికి సంబంధించిన ఆదర్శాలను తెలుసుకో వలసింది.

ఓ....ఊరికే తెలుసుకోవడం ఏం ఖర్మ ఆచరణలో పెడతాను సరేనా ? మేఘాల వెనుక మెరుపులా ఆమె ముఖంలో ఎక్కడిదో చిరునవ్వు ఒకటి తళుక్కుమన్నది. ఇప్పుడు నీవు చేసిన తప్పుకి దొరైతే ఏంచేసేవాడో తెలుసా ?

ఆ చెప్పండి – విస్తరాకులు – ఛీ ఛీ విడాకులూ

అవును అయితే నేను దొరను కాదనుకో—

కాదను కోడమేం ఖర్మ – అవునే అనుకుందాం. ఐతే మీరు నన్ను వెళ్ళిపొమ్మంటారా ? — అంటాననుకో – అప్పుడు నుపేకం చేస్తావు అట్లా చూస్తావెందుకు అప్పుడే ? నీవు యిలాంటి

పనులు చేయరాదని నీతి బోధిచండానికి మాట వరసకు అంటానే అనుకో అపుడు ఏం చేస్తావూ ? అన్నాను.

కాంతానికి మృదువైన మాటలతోనే మంచి నీతి పాఠం బోధించానని సంతోషించాను.

ఏం చేస్తానంటారా ? ఏమిటి చేసేది? వెళ్ళి పొమ్మంటే ఉంటానా ఏమిటంటీ... మాట వరసకు అన్నా నిజంగానే వెళ్ళి పోలేను. అని రకీమని తలుపేసేసుకుంది. పసిపిల్ల ఉలిక్కిపడి ఒక్కటే ఏడవడం తేలుకుట్టినట్లు. తలుపుతీయి... ఇదిగో నిన్నే—సరేలే పిల్ల చేయల్లోని నిలవటం లేదు – అబ్బే తీయండే –

ఇక తలుపు నెట్టుకొని ఇంట్లోకి ప్రవేశించి అన్నాను. "నేను వెదుతున్నాను. ఇక మనకు కుదరదులే" అని

"నేనేం చేశాను? మీకంతకోపం రావడానికి ఎదో సంసారమన్నాక భార్యాభర్తలకి తగూలొస్తే మాత్రం సద్దుకుపోవాలె గాని తెంచుకుపారిపోతారా?— మాట్లాడరేం. సంసారంగుట్టు, రోగం రట్టు అన్నారు. మీరు నన్నిలా అల్లరి పెట్టడం ధర్మం గాదు. అయినా ఇంతకూ నాతప్పేమిటిటా ?

మళ్ళీ యాకరువు పెట్టమంటావా మొదటి నుంచీ ?

వద్దుబాబూ వద్దు. మళ్ళీమొదలెట్టకండి.

అయితే మరి మాట్లాడక. అమ్మాయ్ సుశీ. బండి ఒకటి పిల్చుకొనిరాలన్నాను-

ఉండవే అమ్మాయ్ ఐతే ఎక్కడికీప్రయాణమూ ?

ఎక్కడికైతే నీకెందుకు. ఎక్కడికో పోతాను. సుశీ ఇంకా ఇక్కడే వున్నావుటే ?

ఐతే వెళ్ళిపోవటం నిశ్చయమన్నమాటేనా అంది కాంతం.

నిశ్చయమా అని మెల్లగా అడుగుతున్నావేమిటి వెళ్ళిపోతుంటేనూ అన్నాను దుఃఖాన్ని దిగమింగుకుని.

"మళ్ళీ ఎప్పుడొస్తారు?"

"నీకేం వేళాకోళంగా ఉందేమిటి ? ఇదే ఆఖరుసారి ఈ ఇంట్లో ఇక...... మాట పూర్తి చేయలేక నా గొంతుకలోక్కి సన్నని వణుకు వచ్చింది.

ఆరోజున నేనన్నమాటలు హాస్యానికి కాదు. నిజం చెప ముఖానచెబుతున్నాను. సౌఖ్యంలేకపోయిన తరువాత జీవించడం అనవసరం. అలాగని ప్రాణత్యాగం చేయలేము. ఏదో పెద్దలు ఇచ్చిపోయినదాపతు ఆస్తి వలన సంసారం గడుస్తూంది. నేనున్నా లేకపోయినా కాంతానికి అయిపోయినవి సౌఖ్య దినాలు ఇకముందు. నా బ్రతుక్కి అమావాస్యే. వెన్నెలరాదు. పిల్లలకి భగవంతుడున్నాడు.

నా సంపాదనా, లోకోపకారమూ సున్నకి సున్నా హళ్ళికి హళ్ళి. ఇంకెందుకు ఈ గంపెడు సంసారాన్ని ఈదడం? నేను లేకపోయినా గడిచిపోతుంది. అంచేత

కేవలము మధ్యమైన ఈ సంసారాన్ని వదిలేసి పరాయి దేశాలలో అజ్ఞాతంగా తిరుగుతూ ముక్తిని సాధిద్దామని నిజంగా అంటే నిజంగా అనుకొన్నాను. ఆవిడ మాత్రం నమ్మలేదు. అయితే నిజంగా వెడతారా ? అ—సరే ! వెళ్ళే వాళ్ళను పట్టుకుంటే మటుకు ఆగుతారా ? ఒక్క మాట ఇలా చూడండి. పసిది కూడా వస్తుందట ! ఎట్లా దూకుతుందో చూడండి ఒక్కమాటు తీసుకోండి. ఒక్కసారి కాదుగదా-అరసారైనా తీసుకోను. తెంపుకుపోతున్నవాడిని ఈ ప్రేమ బంధాలతో ఎందుకు కట్టేసావ్ ? పొయ్యేవాణ్ని పోనీయ్. అడ్డురాకు — నవ్వుతావూ ? నీకేం తెలుస్తుంది నా కడుపులో ఆందోళన. నాకు వద్దు ఈ సంసారనరకం. సంఘం శరణం గచ్చామి ధర్మం శరణం గచ్చామి బుద్ధం శరణం గచ్చామి. అబ్బ ! ఎంత కఠినమండీ. సాక్షాత్తు బుద్ధదేవుడే. ఆయన కూడా మహాభినిష్క్రమణానికి ముందు భార్యా పుత్రుల వంక ఒకసారి ప్రేమదృక్కులు ప్రసాదించాడుకదా.

అయితే సరే. ఒక్కసారి ఇయ్యి. ఒక్కసారే. ఒక గాఢాలింగనం - ఒక చుంబనం-సరి తీసుకో-నన్ను బంధించక బుద్ధం-శరణం-గచ్చామి-రావడంలేదు మీ దగ్గరినుండి. "తీసుకో-ఇంద-ఊ" రానంటుంటే— దాన్ని కూడా తీసుకెళ్ళండి. జాగ్రత్తగా పెంచండి. శిష్యురాలౌతుంది.

"మరేం అక్కర్లేదు— ఇంద" నిజంగా వెడతారా ?" "వెడుతుంటేనే" పిల్లల్ని జాగ్రత్తగా పెంచు. ఆ వున్నది చాలు. లేదనకుండా గడవడానికి. అని గిరుక్కున తిరిగాను. ఇటు చూద్దునుగదా పిల్లలంతా ఎక్కడికో ప్రయాణ సన్నాహంలో వున్నారు. కాంతంతో అన్నాను.

వీళ్ళను నామీదకి తోలేపేమిటి ? వీళ్ళను తీసుకుపో. నేను వెళ్ళిపోవాలి. ఈ చివరి రోజున కూడా నీవు నాకు అనుకూలవతివి కావూ అన్నాను కంపిత కంఠంతో.

"వాళ్ళు నా మాట వినరు. మీరే చూసుకోండి ఆ విషయం అంటూ కాంతం చెరచెరా లోపలికి నడిచింది. ఒరేయి ఏమిటి బూడ్సులు తొడుగుతున్నావెందుకూ ?

"నేనూ వస్తా నాన్నా." అదేమిటే అమ్మాయి-నువ్వెక్కడికే సుసీ. నువెందుకురా అట్లా చిందులేస్తావూ? నేనూ వస్తా నాన్నా-నేనూను-నేనో-ఉ-ఉ-ఉ.

ఓరి వెధవల్లారా ! ఎక్కడికి వస్తారు? ఎక్కడికిరా వస్తారూ అంటా! మీ అమ్మ ఉప్మా చేసింది పొండి. ఉహూ-ఉహూ-ఉహూ. అరె. ఎక్కడికిరా వచ్చేదీ ? నీవు ఎక్కడికి వెళ్తున్నావు ? "నేను వెళ్ళిపోతున్నాను." ఊ-ఊ- నేను వస్తా నాన్నా.

ఓరి వెధవా! నేను సంసారం వది

లేస్తున్నా." నేనూ వదిలేస్తా నాన్నా".

ఓరి గాడిదా! నేను సన్యాసం పుచ్చు కుంటానికి వెడుతున్నానురా అన్నాను విసుగ్గా.

నేనూ పుచ్చుకుంటా నాన్నా అన్నాడు మా ఐదేళ్ళ వెధవ - నేనో నాన్నా అని బిక్కముఖం వేసింది సుసీ. ఈ చిన్న వెధవలంతా నాలో సన్యాసం పుచ్చుకో డానికి బయలుదేరారు. బుద్ధ దేవుడికే ఒక్కకొడుకు కాబట్టి తెంచుకుపారిపోయి నాడు. అదీ నిద్రపోతున్నప్పుడు! అదీ అర్ధరాత్రి! అనురసంధ్యవేళ అరవజనుపిల్ల లనువదిలించుకుని వెళ్ళవలసి వచ్చినప్పుడైతే తెలిసేది. ఈ సంసారానికి మానవుడు ఎట్లా కట్టుబడివున్నాడో. కుర్చీలో కూల బడ్డాను కదలకుండా మెదలకుండాను. పిల్లలు నా ముఖం వంక చూశారు. నేను నవ్వకుండాను గంభీరంగాను ఉండడం చూసి పెద్దపిల్లలు ఒక్కొక్కరే జారు కున్నారు. చిన్నవాళ్ళు ఏడుస్తూ తల్లి దగ్గరకు పోయినారు. కళ్ళు మూసు కున్నాను. ఇంటికి నాల్గుదిక్కులా చూసి నిట్టూర్పు విడిచి గుమ్మం దాటి బైట పడ్డాను ఈ విశాల ప్రపంచంలోకి. వీధి మలుపు తిరిగాను బుద్ధదేవుణ్ణి ధ్యానిస్తూ. వెనకాలనుండి పరిగెత్తుకు వస్తున్నారు రాధా విజయలు. పెద్దవాడు లాగూ, చొక్కా కోటువేసుకుని బూడ్సులు తొడుక్కుని చెమ్కీటోపి పెట్టుకుని నాకు నాలుగ్గజాల ముందు నడుస్తున్నాడు-

నేను రావటాన్ని గమనిస్తూ, మాట మాటికి వెనక్కి తిరిగి చూస్తున్నా. పెద్దపిల్లలిద్దరు కొత్త పరికిణీలు కట్టు కుని కొత్త చొక్కాలు తొడుక్కున్నారు. వాళ్ళమ్మనడిగి తీసుకొన్నారు కాబోలు. బంగారు గొలుసులు మెడలో మెరుస్తు న్నవి. దూరంగా రోడ్డుమీద నుంచుని నేను పోవలసిన దారినే ముందుగా గబ గబ నడుస్తున్నారు. పంచరత్నాలను నేను మరొక్కసారి స్మరించాను. వీళ్ళనిజూసి నేను తెల్లబోయినాను. అమ్మాయిలను పిల్చివెళ్ళండే ఇంట్లోకి అన్నాను. వాళ్ళు మేము వేరేపనిమీద ఇంకో చోటికె వెళ్తున్నాము. నీతో రావడంలేదు అని కిలకిలా నవ్వుతూ దూరంగా నుంచు న్నారు.

నువ్వెక్కడికిరా ఫో అన్నాను. దగ్గి రున్న వెధవతో.

నేను వస్తానాన్నా అన్నాడు బిక్క మొహంవేసి. నేను ఎక్కడికి వెడు తున్నానను కొంటున్నావురా అన్నాను. (అమ్మచెప్పిందిలే నాన్నా) అక్కయ్యలు వస్తున్నారుగా నేనుకూడా వస్తా అమ్మ చెప్పిందిలే నాన్నా. నీవూ సినీ మాకి వెడుతున్నావనీ. ఆ, ఆ. అని తెల్ల బోయినాను పిల్లలిద్దరూ కాళ్ళకి చుట్టేసు కుని ఏడుస్తున్నారు. వీధిలోని ఆడవాళ్ళు కిటికీల్లోంచి చూస్తున్నారు. పసిదాన్ని, చిన్నవాణ్ణి ఎత్తుకుని మళ్ళీ గుమ్మంలోకివచ్చేను. పెద్దవాడు ఇష్టంలేక



"పూజ" చిత్రంలో వాణిశ్రీ, సావిత్రి

మెల్లగా అడుగులోఅడుగు వేస్తున్నాడు నా వెనకే. తలుపు తట్టాను. ఎవరది చెయ్యి వూరుకోలేదు వెళ్ళండి. తలుపూ అయ్యో తలుపు తీయవే _ ఎవరా తలుపూ. "నేనే" అంటే....అబ్బ "నేనే" ఎందుకూ ? తీయి చెబుతా "ఏవిటి చెప్పేది. సంసారం పైన విరక్తి పుట్టి పోయిన వాళ్ళకు ఇదేం వికారమూ ? మళ్ళా ఎందుకొచ్చారు ? కాదులే చెబుతా తలుపు తీయి. చేతులు పీకుతున్నాయి.

మా అబ్బాయి వద్దునాన్నా, వెడదాం రా నాన్నా. అమ్మ తీయకపోతే ఏం భయమా ?

ఇంకేం వెళ్ళండి. కొడుకు చెబుతున్నాడుగా సలహా అంటూ తలుపు తీసిందికాంతం. ఎందుకూ మళ్ళీవచ్చారు ? అన్నది అణచి పెట్టుకున్న నవ్వు ముఖంతో.

మరి వీళ్ళంతా ? నన్నేమి చేయమంటారు ? "నువ్వు చేసిందేకాదూ ఇదంతా ? ఈ మాత్రం జయించలేని వాళ్ళు లోకాన్ని జయించడానికి బయలు దేరారు. అంది ఈసడింపుగా పిల్లని అందుకుంటూ. నిజమేలే. ఇక అడ్డంలే అన్నాను విసుగ్గా. ఉహూ .... ఒప్పుకోండి ఓడిపోయానని. సరే ఓడిపోయినాను. కిలకిల నవ్వింది. కాంతం లోపలికి రానిచ్చి దభీమని తలుపేసింది.

# నల్లటి మనిషి

౩

౧

తెనాలికి తొందరపనిమీద వెళ్ళవలసి రైలు టైముకు కొంచెముముందుగనే స్టేషనుకు చేరాను. రైలు ఎక్కేముందు ఒక చివరనుండి ఇంకో చివరకు ప్లాటుఫారంమీద తమాషాగా పచారుచేయటం, ఏదైనా అందమైన ముఖం కనపడుతుందేమోనని చూడటం నాకూ అలవాటే చాలామందికి మల్లే.

ఒక పెట్టెలోమాత్రం ఒంటరిగా కూర్చున్న యువతి కనపించింది. ఆమెముఖం అంత అందమైనది కాదు కాని ముఖకవళికలలో ఏదో కొంతఆకర్షణమాత్రం ఉన్నది. ఆమె దేహచ్ఛాయ పసిమిగాదు. నలుపూగాదు. ఆదోరకం తమాషా చామనచాయ. కేశములుమాత్రం దీర్ఘంగాను దట్టంగాను ఉన్నాయి అనుకొంటూ, ఎందుకంటే, ఆమె వేసుకొన్న బర్మాముడి గుబురుగా గోముగా పెరిగిన గులాబిపొదలాగ ఉన్నది.

ఆమె నన్ను ఆకర్షించింది. రెండుసార్లు అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ తిరిగాను. ఆమె నా వంకకు చూచినప్పుడల్లా నేను తలవంచుకొని నన్ను చూడనట్లు తోచినప్పుడల్లా ఆమెవంకచూడటం మొదలుపెట్టాను. ఇట్ల ఇంకా నాలుగుసారులు తిరిగేసరికి ఆమె ఒంటరిగా ప్రయాణంచేస్తున్నదనీ ఆమెవెంట పెద్దవాళ్లెవ్వరూ లేరని నా కొకఊహకలిగింది. పరాయిస్త్రీయొక్క అందాన్ని చూడటానికి నాకు అదే మొదటిసారి అవకాశంకలగటం.

ఎందుచేతనంటే మాకాంతంలేకుండా ఒంటిరిగా నేనెప్పుడూ ప్రయాణంచేయలేదు. ఒంటిరిగా ఉన్నా, ఆవిడలేని రోజులలో పరకాంత, పనిచేసేమనిషైనా సరే చివరకు నాకళ్ళకు కనపడకుండా ఉండే ఏర్పాటులుచేసి వెళ్ళుతుంది కాంతం. తాను పుట్టినింటికి వెళ్ళే ముందు పనిచేసేదాన్ని తీసివేసి రావద్దని కచ్చితంగా చెప్పి. పోట్లాడో పంపేస్తుంది. ఆవిడ లేనప్పుడు ఆడవాళ్ళు ఎవరూ మాఇంటికి రాయగదా! కాలం అలా గడుస్తూఉండటంమూలాన పరకాంతల ముఖమైనా చూచే అవకాశం నాకెన్నడూ కలగక పోయినందున, ఆరోజున దొరికిన అవకాశాన్ని అపూర్వంగా అనుభవిద్దామనుకొని అట్లా ప్రవర్తించాను.

ఇంతలో రైలుగంట కొట్టారు. పచ్చజండా ఊపారు. నేనూ నాపెట్టెను ఆమనిషి ఉన్న పెట్టెలోనికి నెట్టి ఎక్కాను. పెట్టెను నాప్రక్కనే పెట్టుకొని ఆవిడకు ఎదురుగాఉన్న బల్లపైన కిటికీదగ్గరగా కూర్చోటం తటస్థించింది. ఇదంతా నేను చెయ్యాలని చెయ్యలేదు ఆసమయానికి అట్లా జరిగింది.

బండి కదిలింది నేనిప్పుడు ఆస్త్రీకి ఎదురుగా ఉన్నాను. ఆబండిలో ఇంకా ఇద్దరో ముగ్గురో మనుష్యులు ఉన్నారు. అవతలబెంచీమీద ఖాళీగాఉంది కాని, నేనెందుకు లేవటం, ఆవిడకు కష్టంగాఉంటే ఆవిడే లేచిపోతుంది అని అనుకొని అక్కడేకూర్చుని కొనుక్కున్న హిందూపత్రిక చదువుకుందామని మడత విప్పాను. పేపరు ముఖానికి అడ్డంగా పెట్టుకొని చదవటం ప్రారంభించాను. వాంటెడ్ కాలమ్సు, ప్రకటనలు చదివేసరికి అవలింతవచ్చింది. ఆ సందర్భంలో పేపరు ముఖంమీదినుండి తొలగించుకొంటుంటే ఆవిడ ముఖానికి తగిలింది. ఆవిడ క్రిందకువంగి పేపరులో చివర పేజీలోనున్న విషయమేదో చదువుతున్నదని నాకేం తెలుసూ. అసలు ఇంగ్లీషువచ్చిన మనిషి అనే నేననుకోలేదు. ఆమె ముఖానికి పేపరుకొసలు తగలటం, వెంటనే ఆమెకురులు సవరించుకొంటూ, పమిట సర్దుకోటం చూచేసరికి నాకు నవ్వు వచ్చింది. అందుకని నవ్వుతూ ఎక్స్క్యూజ్ మి అన్నాను. ఆమె మాట్లాడలేదు. ఆవిడకూ నవ్వువచ్చిందికాని నేను ఏమనుకొంటానో అని కాబోలు నవ్వు ఆపుకొన్నది. కాని ఆ ఆపుకొన్న నవ్వు ముఖమంతా వ్యాపించి ఆమె చిరుపెదవులలోనుంచి కండ్లకొసలలోనుంచి తొంగిచూడటం ప్రారంభించింది.

మళ్లీ నేను పేపరుచదవాలని ప్రయత్నించాను. కాని అట్లా తొంగిచూడివనళ్ళ నన్ను చక్కిలిగింత పెట్టటం మొదలుపెట్టింది. కళ్లంతా ఏదో తేలిపోతుటమున్నా చదువుతున్నది అర్థంకాకపోవటం! అదీ నాఅవస్థ. ఆగిలిగింత ఎంతోసేపు ఆపుకొన్నాను. కాని ఆవిడతో మాట్లాడాలనిపించింది. పరస్త్రీతో మాట్లాడటం తప్పు అనీ, మాట్లాడినంత మాత్రాన ఏతప్పూలేదనీ రెండు ఆలోచనలో ఒకదాన్నొకటి తరుముకుంటూ వచ్చినయి. అదీకాక ఆకళ్లు, నొసలూ, ఆకెంపు పెదవులూ నన్ను అల్లా పలకరిస్తూఉంటే నేను మాట్లాడక ఊరుకోనా?

పేపరు ఇంతవరకూ మాఇద్దరిమధ్య తెరగాఉంది. దాన్నిమడిచి చేత్తోపట్టుకొని ఆవిడవంక ఒకమారు చూచి చప్పున మళ్ళీ కిటికీలోనుంచి ఆకాశంకేసి చూశాను. నాకెట్లా తెలిసిందో అట్లా చూపులను దొంగిలించాలని! నల్లనిమేఘాలు ఉన్నాయి ఒకవైపున. ఎదురుగా దిక్సతి తనకెంపు పెదవులతో అతనివైపు చూస్తున్నది. మేఘుడు ఊరుకొన్నాడా. ఆరక్తిమను గ్రహిస్తూనేఉన్నాడు. ఇంతలో ఆమె ఏంచేస్తున్నదో చూద్దామని బుద్ధిపుట్టి ఆమెవంక తిరిగిచూచాను. ఆమె ఆకాశాన్నిచూస్తున్నది.

నేను ఆమెను చూస్తున్నానని గ్రహించి ఆమె నావంక తిరిగింది. నేను నాచేతులోనున్న పేపరును ఆమెకు అందించాను. ఆమె మాట్లాడకుండా పుచ్చుకొని అటూఇటూ తిరగేసి ఏదో చదివినట్లేచదివి అయిదునిమిషాలలో మళ్ళా నాబల్లమీద పెట్టేసింది. పెదవి విప్పి ఒక్కపలుకైనా పలుకలేదు. కాని ఆకళ్ళు, నొసలు నవ్వుతునే యున్నవి.

ఇంతలో గుడివాడస్టేషను సమీపించాము. బందరు నుండి బయలుదేరినబండి ఇంత త్వరలో గుడివాడ వస్తుందనుకోలేదు. ఇంకేముంది; ఇంక కాసేపట్లో బెజవాడ వస్తుంది. అటుతరువాత ఎవరిదారి వారిదేకదా అనిపించింది.

చల్లనిగాలి వీస్తున్నది. వెన్నెలరాత్రికూడాను. గాలి నాచెవులో రహస్యంగా "ఊరికే చూస్తూ కూచుంటావేం. మాట్లాడరాదా" అని చెప్పింది. ధైర్యంతో పెద్దమనిషి తరహాగానే అన్నాను. "అమ్మా మీ రెంతవరకు ప్రయాణంచేస్తారు" అని. ఆమె నవ్వుతూ "మీరో" అన్నది. నేను తెనాలి వెడుతున్నానన్నాను. "నేనూ అటువైపే వస్తా" నన్నది. ఆమాటలు వినేసరికి నాకు ఏదో దేవగానం విన్నట్లు తోన్నదిగాని ఎదుటనున్న స్త్రీ మాట్లాడినట్లుగాలేదు. బెజవాడలో కూడ ఆమెఎక్కిన పెట్టెలోనే నేనూ ఎక్కాలని అనుకొన్నాను. అదేమిటో ఆమె సామీప్యమే నాకంత ఆనందాన్ని ఇచ్చింది. అద్వైతులు దీన్నే కాబోలు సామీప్యం అంటారు!

## ౨

గుడివాడలో బండి ఆగినతరువాత ఆవిడ నన్ను ఉద్దేశించి "ఇక్కడ నీళ్ళకుళాయి ఎటువైపు ఉందండీ" అన్నది. ఇన్నిమాటలు ఒకేసారి వినేసరికి వెయ్యివీణెలను ఒక్కసారి మీటినట్లుంది. దూరాన ఎక్కడో పాడుతున్న మధురగానాన్ని హాయిగా వింటున్నట్లుంది. నేను, "ఇల్లా ఇవ్వండి నీరుతెచ్చి పెడతాను" అన్నాను. ఆమె చిరునవ్వుతో "మీకు శ్రమ" అన్నది. "ఫరవాలేదు ఇల్లా ఇవ్వండి" అని ఆ మరచెంబు ఆమెచేత్తోనుండి తీసుకొని నీళ్ళుండే తావుకు ఒక్కపరుగున వెళ్లాను. కుళాయిలోని నీళ్ళు పట్టాముగాని ఆనీళ్ళు వేడిగాఉన్నాయి. ఛీ ఈ వేడి నీళ్ళు ఆవిడకు ఇయ్యటం ధీరలక్షణం కాదనుకొని, ఆ చెంబుతీసుకొని రైలులో సోడాఅమ్మే పెట్టెదగ్గరకు వెళ్ళాను. స్పెన్సరు సోడాఒకటి గ్లాసులో పోయించుకొని,అందులో కొంచెం తీపికలిపించి, కొంచెం మంచుగడ్డ వేయించి పట్టుకెళ్ళాను. అయిదు అణాలు చెల్లించాను అనుకోండి, అది వేరేవిషయం

ఆమెకు సోడాఇచ్చి "పుచ్చుకోండి నీరు వెచ్చగా ఉన్నయి. దాహంతీరదు" అన్నాను. "అయ్యో!చాలా శ్రమపడ్డారే" అని, సోడా తీసుకొన్నది. ఏదో పరోపకారంచేస్తున్నానని నాకు నేను సమాధానం చెప్పుకొని, "అ, ఏమిశ్రమలెండి" అన్నాను; ఏదో సామాన్యంగా అట్లా స్నేహితులకూ, పరిచయులకూ నిత్యం

సోడాలిఇచ్చే ధనవంతుడ్నిలాగ చూస్తా. ఆమె ఆ గ్లాసులోని అమృతంలాంటి సోడాతాగి చేతిరుమాలుతో తుడుచుకొంటూ ఖాళీగ్లాసు నాకిచ్చింది. నేను ఆగ్లాసును సోడా విక్రయంచేసినవానికి ఇచ్చేశాను. నాకూ దాహం అవుతున్నది. కాని సోడాపుచ్చుకొంటే డబ్బు అయిపోతుందని ఆవేశినిళ్ళే కావిని త్రాగి మళ్ళీ యథాస్థానంలో కూర్చున్నాను. బండి కదిలింది. ఆవిడతో పరిచయం కలిగినందుకు నాలోనేను సంతోషించాను. ఆవిడను ఎన్నోప్రశ్నలు అడుగుదామనుకొన్నా. కాని ఆవిడ అడిగిన ప్రశ్నకల్లా క్లుప్తమైన జబాబు చెప్పటం, కొన్నిప్రశ్నలకు జబాబేచెప్పక చిరునవ్వు నవ్వి ఊరుకోవటం నా కంతప్రోత్సాహకరంగా ఉండలేదు. కాని ఆమెకళ్ళు మహాచెడ్డవి. అవి నన్ను లెక్కలేనన్ని ప్రశ్నలువేసినవి దారిపొడుగునా, నాకళ్ళు ఆ ప్రశ్నల కన్నింటికి సావధానంగా జబాబు చెప్పినవి. ఇంతలోకే బెజవాడ వచ్చాము.

స్టేషనులో రైలుదిగాము. తెనాలివెళ్ళే మెయిలుకు ఇంకా గంటన్నరటైముంది. అక్కడే కూర్చుందాం అన్నాను. ప్లాటుఫారంమీద కూర్చుంటే వచ్చిపొయ్యే వాళ్ళు ఎగాదిగా చూస్తారండి. వెయిటింగురూములో నన్ను కూర్చోబెట్టండి అని ఆమె వినయంగా కోరింది. అల్లా స్త్రీ కోరుతుంటే ఎవ్వరు కాదనగలరు?

ఆవిడవద్ద రెండుపెట్టెలు ఒకపరుపుచుట్టా ఉన్నవి. అవి వెయిటింగురూముకు చేరాలి కూలీ మూడుపావలాలకు తక్కువైతే వాటిని ముట్టుకోనన్నాడు. అన్నా వాడు చక్కాపోక అక్కడే నిలబడి వచ్చినవాడితో నల్లా నేను మూడుపావలాలియ్యమన్నారా, అయ్యగారు సందేహిస్తున్నారు అనటం మొదలు పెట్టాడు, ఆకొత్తగావచ్చినవాడు ఇచ్చేసేయండి బాబూ, అంతకు తక్కువ కెవ్వరూరారు అని సిఫార్సుచేసి పోవటం నాకేం తోచిందికాదు. ఇంతలో ఆవిడ ఒక పెట్టె నెత్తుకొని పెడదాంరండి అన్నది. మొగవాడ్ని దగ్గర ఉండి కూడా సుకుమారిచేత పెట్టెమోయించటం అనుచితము అనితోచి "మీరెందుకు? నే పట్టుకొస్తాను ఇల్లా ఇవ్వండి" అని, ఆవిడ రెండుపెట్టెలూ నాబుజానపెట్టుకొని నాపెట్టె చేత్తోపట్టుకొని ఫర్లాంగుదూరంలో ఉన్న వెయిటింగురూముచేరేసరికి బుజాలు పీక్కొనిపోయినాయి. నడుము కలకబారి నొప్పెట్టింది. ఎప్పుడూ ఒకచిన్న సూట్‌కేసయినా మోసిఎరగనవాడను. వెయిటింగురూములో ఆవిడను కూర్చోబెట్టాను. మూడవతరగతి ప్రయాణీకులు అక్కడ కూర్చోకూడదు. కాని అక్కడ ఉండే మనిషికి ఒక పావలాయిచ్చి సంతోషపరిచాను. చాలాఘనకార్యంచేశాను. ఇంతా కష్టపడ్డా, ఆవిడ వెయిటింగురూములోపల నేను బయటూనా? అని కష్టమేసింది మనస్సులో.

నడుములు విరిగిపోతుంటే బయట ఉక్కతినశిలలమైన నడుమువాల్చి లోపలఆవిడ నేను చేసిన ఏర్పాటుకు ఫలితంగా సోఫాలో, ఎలక్ట్రిక్ ఫాన్‌క్రింద పడుకోటం చూశాను. నేను వెర్రివాడిని అయినానా ఏమిటి? ఎవరివో ఒక ఆవిడ పెట్టెలు మోయటమేమిటి! ఈకర్మం ఏమిటి! అని అనుకొన్నాను. ఇంతలో ఆమె నోసలూ, కళ్ళూ, పెదవులూ నా ఎదుట నిలువబడి, అల్లా అనుకోక. ఎంత సరదా! అన్నాయి. ఎట్లాయితేనేం మళ్ళీ ఆఊహా రాలేదు.

ఆకలి అవుతున్నది, హోటలుకు వెళ్ళి రెండు మెతుకులు తినకపోతే బ్రతికేటట్లులేదు. వెంటనేవెళ్ళి భోజనంచేశాను. నేను భోజనంచేసి ఆవిడకు తీసుకొనిపోకపోతే మర్యాదకాదని తోచింది అందుకని టిఫిన్ కారియర్‌లో భోజనం పెట్టించుకొని ఆవిడకోసం తీసికెళ్ళాను. ఆవిడ "అయ్యో, ఎంతశ్రమపడ్డారండీ" అని అంటూ కారియర్ అందుకొని అక్కడే పెట్టుకొని భోజనంచేసింది. కావలసినన్ని అవీ నేనే తెచ్చి ఇచ్చాను. అటుతరవాత ఆగిన్నెలుకడిగి హోటలు వాడికి ఇచ్చేసినాను. నాకర్మంకాలితే ఎంగిలిగిన్నెలు కూడా కడిగాను! అయితే ఇదంతా రోమాన్సుగాలం స్త్రీ అనే పదాలలో శరణ్యంపుచ్చుకొని అంత అసహ్యం అనిపించవు.

భోజనానంతరం ఆవిడ ఏమిటో చేతిలోకి తీసికొని నావంకతిరిగి "ఇదిగో తీసికోండి" అనినట్లు సంజ్ఞ చేసింది. పోకచెక్క ఏమిటో ఇయ్యవస్తున్నదనుకొని

అసలా బీగోపులవంటి మెత్తనిచేతులు తగలటంవల్ల కలిగే స్పర్శసౌఖ్యం ఊహించుకొని ఆనందంతో చెయ్యి జాపాను. ఆమె తనచేతిని నాచేతికి తాకనియ్యకుండా, తాకితే ఎలక్ట్రిక్ షాక్ తగిలి చచ్చిపోతాననుకొందో ఏమోమరి ఎత్తి నాచేతిలో పడేసింది రాగిడబ్బు ఒకటి; "కిల్లీ కొనుక్కోండి" అన్నది నవ్వుతూ! నాకు అరికాలుమంట నెత్తికెక్కింది. ఇందాకటినుంచీ సోఫాకు, భోజనానికి డబ్బు ఖర్చుపెడుతూ అడ్డమైన చాకిరీచేస్తుంటే విశ్వాసంలేకుండా కిల్లీకని ఒకరాగిడబ్బు ఎత్తి చేతిలో వేస్తుందా! అదీ ఒక్క కిల్లీకా? అని ఉక్రోషంవచ్చింది.

నాముఖంలో ఉండే కలవికలు తెలియజేసే భావాలను ఆమె గ్రహించింది. ఒక్కనవ్వు నవ్వింది. మచ్చుమందు చల్లినట్లయింది! మళ్ళీ మాట్లాడకుండా, ఆ కాసీ ఆమెచేతిలోకి గిరాటుపెట్టి. కిల్లీదుకాణం దగ్గరకెళ్ళి అర్థణా, అర్థణా కిల్లీలు మాంచి సుగంధవస్తువులతో కూర్చినవి రెండు కట్టించుకొనివచ్చి ఒకటి ఆమెకుచూపి ఇస్తాను రమ్మని పిలిచాను. ఆమె అక్కడికే గిరాటు వెయ్యమని సంజ్ఞ చేసింది కోపంతో విసిరాను ఆమెపైకి. ఆమె నవ్వుతూనే, తీసుకొని ఊరుకొన్నది.

మళ్ళీ రైలుబైలు అయింది. తెనాలివైపునకు వెళ్ళే మెయిలు వచ్చింది. మళ్ళీ ఆవిడపెట్టెలను రైలుపెట్టెలోకి తోశాను. ఇద్దరం ఒకపెట్టెలోనే ఎక్కాము. ఆవిడప్రక్కనే కూర్చున్నాను. ఇంత అవస్థపడ్డందుకు ఆవిడ నామీద కృతజ్ఞురాలై యుంటుందనుకొని ఏమిటో మాట్లాడాలని ఆవిడకు దగ్గరగా జరిగాను. కుచ్చెళ్ళ చెరుగులు దగ్గరకు లాక్కొని, ఒదుక్కొని "చూడండీ కొంచెందూరంగా కూర్చోండి" అన్నది మెల్లగాసన్నని గొంతుకతో రెండోవాడికి వినపడకుండా. దానితో నాప్రాణాలు చల్లబడ్డవి. నేనెందుకు నాగౌరవాన్ని చంపుకొని ఈవిడకు అరవచాకిరీ చేస్తున్నానా అని విచారంకలిగింది.

తెనాలిస్టేషను వచ్చింది. నేనుదిగి నాపెట్టె దింపుకొని ఆమెకేసిచూస్తూ "దిగరేం" అన్నాను. "ఇక్కడ కాదు లెండి నేను దిగటం" అన్నది. ఆమాట వినేసరికి నామీదైన పిడుగుపడ్డట్లయింది. తక్షణం నాపెట్టెను చేతోపట్టుకొని వెళ్ళిపోతూ ఆవిడవంక తిరిగి ఉక్రోషం పట్టలేక కసిఅంతా తీరేటట్లుగా వెక్కిరింతగా నానా వికారపుచేష్టలూచేసి బైటకు వినపడకుండా తిట్టుకొన్నాను. ఆవిడ ఏమో అనొస్తుంటే వినిపించకోలేదు. ఆవిడ పకాపకా నవ్వింది.

డబ్బులంతా ఖర్చు అయిపోయింది. పెట్టెను మోయటానికి కూలీని పెట్టుకొందామన్నా దమ్మిడీలేదు. బండి కట్టించుకోటానికి అసలే లేదుగదా! పోనీ ఇంటివద్ద మావాళ్ళనుఅడిగి ఇయ్యకూడదా అను కొంటే వెళ్ళేది అత్తవారింటికి. వెళ్ళటం వెళ్ళటం అర్థణా డబ్బులు అప్పు అడగటంకంటె చండాలప్పని ఇంకేముంది. అపెట్టె నెత్తినేసుకొన్నాను. ఇంటిదారిపట్టాను.

బెజవాడ స్టేషనులో పెట్టెను మోయటంచేత, భుజాలు, నడుమూ పీక్కుపోతున్నది. శ్రీరామమూర్తి జ్ఞాపకానికి వచ్చాడు. రామస్మరణ చేయాలనుకొన్నాను. కాని ఆ నొసలూ, ఆకళ్ళూ, ఆఎర్రని పెదిమలూ తొంగిచూస్తున్న నవ్వూ, నాఎదుట ప్రత్యక్షమై నన్ను గూటు వెక్కిరించటం మొదలు పెట్టినవి. రామస్మరణ ఎట్లా సాగుతుంది?

మునిమాణిక్యం నరసింహారావు



# బావ మరుదులు



సాంసారిక హాస్యము అంటే సంసార సంబంధమైన హాస్యము. భార్యాభర్తలు, వదినా మరదళ్లు, బావా మరుదులు ఒకరిపై ఒకరు విసురుకునే ఛలోక్తులు, సరసోక్తులు, వక్రోక్తులు మొదలైన ఉక్తి విశేషాలతో కూడిన రసవంతమైన వాగ్వ్యాపారమే సాంసారిక హాస్యము.

కోర్టులలో ముద్దాయీలుగాని, న్యాయాధిపతులుగాని ఎప్పుడైనా హాస్యంగా మాట్లాడవచ్చు. హాస్యప్రవృత్తి కలవారు ఎక్కడున్నా సమయం చిక్కితే ఒక్క విసురు విసరకుండా వూరుకోరు.

ఒకడు ఒకే యింటికి రెండుసార్లు కన్నం వేశాడట.—ఆ దొంగను న్యాయస్థానానికి విచారణకై తీసుకొనివచ్చారు. "ఒకే ఇంటికి రెండుసార్లు ఎందుకు కన్నం వేశావు?" అని అడిగితే, నిందితుడు:- "బాబూ! ఈ రోజుల్లో ఇండ్లకొరత ఏర్పడ్డదీ అన్నమాట తమకు తెలియంది కాదు గదా!"... అన్నాడు. ఇట్లాంటిది న్యాయస్థానాలకు చెందిన హాస్యము.

ఇదే విధంగా రోగులు డాక్టరుతోగాని, డాక్టరు రోగులతోగాని హాస్యంగా మాట్లాడితే అది మెడికల హ్యూమర్ అంటారు.

ఇల్లాగే వివిధ జీవిత రంగాలకు సంబంధించిన హాస్యపు పలుకులు ఉండనే ఉంటవి. అన్నిటిలోకి సర్వజనానుభవ వేద్యమైనది, ప్రతివానికి అతి సన్నిహితమైనది ఈ సాంసారిక హాస్యం; అన్నిటిలోకి ఉత్తమమైనది రమణీయమైనది కూడా...

బావ మరదుల మధ్య హాస్యం సంప్రదాయసిద్ధము. అది వారిద్దరకును మధ్యగల సన్నిహితత్వాన్ని, సమాదరణను సూచించేదిగా వుంటుంది; ఒకరిపై ఒకరికిగల అనురాగాన్ని సూచించేదిగా కూడా ఉంటుంది. ఇందులో ద్వేషానికి తావులేదు.

బావతో హాస్యం ఆడటమూ, వేళాకోళం చేయడమూ పూర్వం నుంచీ వున్నదే. అయితే, పూర్వపు రోజులలో కొంత వెగటుగాను, మోటుగాను ఉంది ఈ హాస్య వ్యాపారం.—

బావగారు నిద్రపోతున్న సమయంలో, ఆయన జుట్టుకూ, మంచం నవారుకూ ముడి వేయడమూ, తమలపాకులలో చింతగింజ పెట్టి ఇవ్వడమూ, పడుకొనే పక్కపైన కనపడకుండా పల్లేరుకాయలు పోయడమూ మొదలైన చిలిపిచేష్టలవల్ల కొంత వినోదాన్ని సాధించేవారు.

ఇదంతా చేష్టలను ఆశ్రయించుకొనిన హాస్యం. బావామరుదుల మధ్య నడిచే హాస్యము చాలావరకు చేష్టానుగతంగానే వుంటుంది. బావ మరుదులు ఇద్దరూ నాగరీకులు, సంస్కృతి కలవారు, అయినప్పుడు ఆ హాస్యం వాగ్గతమై ఉత్తమ స్థాయికి చెందినది అవుతుంది.

ఏదో ఒక కొంటెపనిచేసి, అవతల మనిషిని ఏడ్పించడము సులభం; హృదయాన్ని గిలిగింత పెట్టగలయట్టి హాస్యపు పలుకు పలకడమూ కష్టమే.

బావ మరదుల హాస్య ప్రసంగాలలో జుగుప్సాకరము కానట్టి, వికార రహితమై




నట్టి ఉత్తమ హాస్యం జనించేందుకు అవకాశమున్నది.

ఇట్టి ఉత్తమ హాస్యం వాగాశ్రయం కావచ్చు, లేదా, క్రియాశ్రయం కావచ్చు. మా బావమరిది వేషాన్ని గురించి వర్ణించి నవ్వించడానికి ఏమాత్రమూ ఆస్కారం లేదు. చక్కని దుస్తులు వేసుకొంటాడు; చక్కగా హాస్యంగా మాట్లాడుతాడు. బావ

మునిమాణిక్యం
నరసింహారావు

మరిది అన్నవాడు ఎక్కడైనా అంతే. బావకంటే మరిదే అన్నివిధాల మెరుగ్గా కనపడుతూ వుంటాడు.

బావ మరదులు అన్న జాతి మనుష్యులు-ఆజాతి వృద్ధి పొందుగాక!—సంస్కారం కలవారై, ఇంట్లో ఇల్లాళ్ళకు అత్యంత సన్నిహితులూ, ప్రేమపాత్రులూఅయి, తమ తమ తోడబుట్టినవారితో కలిసి బావలను హాస్యమాడుతూ వుంటారు. ఈ వ్యాపారంలో తోడబుట్టిన వానికి ఇంటి ఇల్లాలు ఎప్పుడూ తోడు నీడగా ఉంటూ, అతడు పాడే పాటకు పక్కవాయిద్యం వాయిస్తూ, వుంటుంది. అప్పా తమ్ముళ్లు ఇద్దరూ కలిసి బావగారిని రెండుప్రక్కలా వాయిస్తూ, హేళనచేస్తూ, వేళాకోళం చేస్తూ ఒకొకప్పుడు ఆనందాన్ని మరికొన్ని సమయాలలో కించిత్తుగా మనఃక్లేశాన్ని కలిగిస్తూ ఉంటారు. ఒకప్పుడు వీరిద్దరికితోడు మరదలుపిల్ల కూడా ఉంటుంది. అప్పుడు వీళ్లు ముగ్గురూ మాట్లాడే హాస్యపు పలుకులతోనూ, చేసే అల్లరులతోనూ ఇల్లు స్వర్గఖండమై పోతుంది.

బావ మరిది కొంత సంస్కారం కలవాడైతే, అదొక రకం హాస్యం వస్తుంది. మా బావ మరిది ఒకసారి వచ్చి, ఒగరుస్తూ, ఆయాసపడుతూ మేడమీది నుంచి క్రిందికి రెండుమూడు మెట్లు ఒక్కసారి, దూకుతూ వచ్చాడు. నేనూ మా ఆవిడా మాట్లాడుకొంటున్నాము. వాడింక పద్ధతిని, వాడి ముఖ కవళికను, ఆ దూకుడునూ, ధూంధాంను చూచి ఎవరినో కొట్టివచ్చాడను కొన్నాము. నే ఆశ్చర్యపోయినాను. వాళ్లి అక్కయ్య అదుర్దాపడ్డది; "ఏమిట్రా! ఏంజేసి వచ్చావు" అన్నాను. వాడు భీభత్స భయానక రసాలను ప్రదర్శిస్తూ, "చంపేశాను!" అని వైరివీర సంహారము చేసినట్లు చూశాడు.

"ఏమిట్రా! ఏం చంపావు?" అన్నాను. దానికి సరియైన సమాధానం చెప్పకుండా, "చంపక వూరుకుంటానికి నేనేమీ పిరికి పందను కాను. అందులో నా శరీరరాన్ని బాకు లాంటి ఆయుధంతో గుచ్చి, రక్తం కారే లాగున చేస్తే నేను నోరుమూసుకొని ఊరుకొనేదా! కళ్లు మూసుకొని పడుకొనేదా?" అన్నాడు, కళ్లు ఎర్రచేసి చూస్తూ.

కాస్త ఆయాసం తీర్చుకొని, మళ్లీ ఇల్లాగ అన్నాడు: "అవును బావా! నేను బాధ పడుతూ తలదిండులో దూర్చి, ఆ బాకు పోట్లను సహిస్తూ ఉండలేక పోయాను! విరోధి పై పడ్డాను. విరోధి నాకు అందకుండా అక్కడ నుంచి ఇక్కడకూ, ఇక్కడనుంచి అక్కడకూ గంతులు వేసి, నాకు చిక్కక, నా ఆయుధానికి గురిగాక, నన్నానా తిప్పలూ పెట్టడం జరిగింది. చివరకు సర్వనాశనం అయింది. ఒక్కగట్టిదెబ్బతో శత్రువు గిలగిల కొట్టుకొని చావడం జరిగింది. శత్రునాశనం అయింది. ఇహ, హాయిగా నిద్రపోతాను. శత్రువు బొందిలో ప్రాణమున్నంత వరకూ నాకు నిద్రపట్టలేదు. చంపేశాను, బాదేశాను నా రక్తం శత్రువు కళ్లజూస్తే, నేను శత్రువు రక్తం అంతటా చిమ్మేశాను. నా కసి తీరింది."

"ఏమిటిరా? ఏమి చంపావురా? మమ్ములను పిలువక పోయినావా? ఎక్కడ చంపావు?" అన్నాను నేను ఆదుర్దాగా.

"నా గదిలోనే చంపాను. చూస్తే నీకే తెలుస్తుంది. నేను కాస్త అలా వెళ్లి, కాఫీ తాగివస్తాను. అని అరచి పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ వెళ్లిపోయాడు." వట్టి తొందర పాటు స్వభావం కలవాడు, చూద్దాంరా..." అన్నాను. ఆమే, నేనూ మేడపైకి వెళ్లి, వాడి గదిలో చూశాము. అక్కడ చచ్చిన వాళ్ళు ఎవరూ కనపడలేదు."

మా ఆవిడ అంతటా కలయాజూచి,—"అవునండోయ్! పాపం అన్యాయంగా చంపాడండీ!" అంటూ, అటు చూస్తున్నది. "అవిగో ప్రక్కపైన చచ్చినవన్నీ, ఈగలు, నల్లులు!" ఇద్దరం నవ్వుకొన్నాము. కొద్దిగా ఆందోళన కలుగజేసినా, చాలా నవ్వుతో తగిన రీతిగా వ్యవహారం నడిపాడు. బావ మరుదుల హాస్యం ఇలా వుంటుంది.

బావమరుదుల హాస్యం అనుపూర్వీక సంప్రదాయమే అయినా ఆ వ్యవసాయం బాగా సాగలేదు. హాస్యం ఏపుగా పెరగనూ లేదు. ఫలపుష్ప భరిత సుందరమూ కాలేదు. గిడసబారిపోయి, మరుగుజ్జు తనమును పొందింది. ఒకొక్కప్పుడు ఆ మొరటు హాస్యం అశ్లీలస్ఫోరకంగానూ, అమంగళకరంగానూ కూడా వుంటుంది.

గాలివానవచ్చింది. తెల్లవార్లూ బ్రహ్మాండమైన గాలితో వర్షం కురిసింది. బావమరిది వరుస అయిన ఒకాయన - మంచి పండితుడు కూడా - వచ్చి యోగక్షేమం విచారించే హాస్యపుధోరణి ఇది: "ఏమమ్మా అక్కయ్యా! బావ ఇంకా బ్రతికే వున్నాడా? మొండి ఘటం లే!...నీ సూత్రంకూడా గట్టిదిలే," అని పకపకా నవ్వాడు-పాపం ఆయన చాలా మంచివాడు. సుహృదయుడు. అయితే ఏమి!? హాస్యం అనేసరికి మోటు తనము వచ్చింది. ఏదైనా సాహిత్య విషయకమైన

(47-వ పేజీ చూడండి)

 

# బావామరదులు



(11-వ పేజీ తరువాయి)

ప్రసంగం రానీయండి ఆయన సుమనోహరమైన సంభాషణ నడుపగలడు.

ఆయన సంగతి అట్లా వుంచండి. తెనాలి రామకృష్ణుడు ఎంతటి ప్రతిభావంతుడు! ఎంతటి రసజ్ఞుడు! ఆయన నోటివెంట వచ్చిన హాస్యపు పలుకు ఎంత మనోజ్ఞంగా, ప్రతిభావంతంగా వుండాలి! తిమ్మన కవి తూగుటుయ్యాలపై కూర్చుని ఉన్నప్పుడు, రామకృష్ణకవి వచ్చాడు. వాళ్లిద్దరికీ బావామరదుల వరస. "బావా ఊతునా!" అన్నాడు. తిమ్మన అంగీకార సూచకంగా తలవూపేసరికి రామకృష్ణుడు బావగారిపై తుపుక్కున ఉమిసి శ్లేషార్థాన్ని క్రియా పూర్వకంగా సాధించాడు. ఊహా ఏమంత రసవంతంగా లేదు. రామకృష్ణుడంతటి మహాకవి ఇంతటి మోటుహాస్యం నడిపాడంటే నవ్వవలసింది పోయి ఏడ్వవలసివస్తుంది. ఇది జుగుప్సాకరంగా ఉంది; ఏహ్యంగానూ వున్నది. అసలు క్రియా జన్య హాస్యమే ఉత్తమమైనది కాదు. అందులో మరీ హీనంగా ఉంది. అంగడీసు, ఆక్షిప్తుడూ కూడా సంతోషంతో నవ్వుకోగలదిగా ఉండాలి హాస్యపు పలుకు: అప్పుడే అది ఉత్తమమైనది కూడా అవుతుంది. బావ మరదినైనా, భార్యనైనా పూలగుత్తితో తాడనం చేస్తే అందంగా ఉంటుంది గాని, బర్రె పలుపులో బాదితే, అందులో అందమూ! అది హాస్యమూ!

ఇరవయ్యో శతాబ్దం వచ్చిందాకా, ఆంధ్రుల హాస్య ప్రసంగాలు అల్లాగే ఉక్కుండేవి. ఇప్పటి సంగతి వేరు. బావమరుదుల మధ్య మనోజ్ఞమైన హాస్యపు పలుకులు దొర్లుతూఉంటవి.

ఒక గృహస్థు ఇంటికి ఒక పెద్ద మనిషి వచ్చాడు. గృహస్థు ఆయనతో కాసేపు మాట్లాడాక ఆయన వెడతానని లేచినపుడు, తానుకూడా లేచి వీధి గుమ్మందాకా అతనితో నడిచి పంపించి వచ్చాడు. ఆయనవచ్చేసరికి ఆయన బావమరిది తన అక్కగారి దగ్గరకూర్చుని కాఫీతాగుతూ ఏదో మాటలు చెపుతూ నవ్వుతున్నాడు.

ఇంటాయనను చూడడముతోనే గృహిణి నవ్వుతూ అన్నది: "ఏమండీ శ్రమపడి అంత దూరం పంపించి వచ్చారే...కాఫీ చల్లారి పోతున్నది తెలియదా?" ఆయన ఏమీ సమాధానం చెప్పక వూరుకున్నాడు. ఇంతలో ఆయన బావమరది ధ్వనివ్యంజకంగా అన్నాడు. "అక్కయ్యా, బావ సంగతి నీకు తెలియునిదా? గేటుదాకా కాదు వీధి మలుపుదాకాకూడా పంపించివస్తాడు. అవసరమని తోస్తే, ఎవరైనా ఇంటికివస్తే వారిని ఆహ్వానించడము కంటే, సాగనంపడమే బావకు ఎక్కువ ఇష్టం" బాగుంది. ఇది సుకుమారంగా వుంది. పరిహసింపబడిన వాడు, పరిహాసకుడు కూడా కలిసి నవ్వుకోవచ్చు, ఎవ్వరికీ గుచ్చుకోదు. శిరీషకుసుమపేశలత్వము కలిగివున్న హాస్యము ఇది. ఈ రోజులలో బావ మరదుల హాస్యం సంస్కృతి, విద్యగల కుటుంబాలలో మాత్రం ఇలాగ ఉంటుంది.

బావమరదులు ఒకరినొకరు హాస్యం ఆడుకోవచ్చుననే సంప్రదాయం ఒకటి వుండబట్టే ఇటువంటి హాస్య సంపద మనకు లభిస్తున్నది. దీనికి, అనగా, ఇట్టి సాంఘిక మర్యాదలను ఏర్పరచినందులకు మనము మన సంఘాన్ని అభినందించాలి.

నా స్నేహితుడు పెళ్ళిఅయిన కొత్తరోజులలో గుంటూరులో ఉంటూ వుండేవాడు. అప్పటికి చాలా చిన్నతనం ... ఇల్లు కనిపెట్టుకొనివుండి 'హర్ మెజస్టీస్ సర్వీసు'లో అహర్నిశాలు పడివుండడము అతనికి ఇంకా పట్టుబడలేదు. పాఠశాలలో పని అయిపోయినతరువాత, అటునుంచే స్నేహితుల ఇళ్లకు వెళ్ళి వాళ్ళతో చాలాసేపు ప్రొద్దుపోయినదాకా, కులాసాగా కాలక్షేపం చేసి ఇంటికి ఆలస్యంగా వస్తూవుండేవాడు.

ఈ పరిస్థితి ఆయనభార్యకూ, పెద్ద బావమరదికీ కూడా కష్టగాఉండేది. చిన్న బావమరది ఒకాయన ఉండేవాడు. పదునాలుగు సంవత్సరముల వయస్సుగల కుర్రవాడు. వాడుమటుకు బావగారు ఆలస్యంగా రావడము మనస్సులో పెట్టుకొని, తనూ ఆలస్యంగా వస్తూవుండేవాడు. కుర్రవాడు కొంపకు వేళకురాకుండా తిరుగుతున్నాడని తెలిసికొని ఆ కుర్రవాడిని అదుపులో పెట్టాలని ఒకరోజున గట్టిగా చీవాట్లువేసి చివరకు "ఓరీ, నీవు చెడుమార్గానపడి, ఎందుకూ పనికిరాకుండా పోతున్నావు," అన్నాడు. కుర్రవాడు విచారంతో తల వంచుకొన్నాడు. అంతటితో వూరుకోక, "తెలుస్తున్నదా నేను చెప్పేమాట?" అన్నాడు. వాడు తల వూపాడు. "ఏమి తెలిసింది?" అని తరిచి ప్రశ్నించాడు.

"నేను ఎందుకూ పనికిరాకుండా పోతున్నానని తెలిసింది," అని కుర్రాడు బుఱుక్కున ఏడ్చాడు. ఆయన తృప్తిపడి, "చదువుకో పో..." అని కుర్రవాణ్ణి పంపి,

# బావామరుదులు

తాను చాలామంచి పని చేసినట్లు అంతా అనుకుంటున్నారో లేదో తెలుసుకోడానికి గర్వంగా భార్యవంకా, పెద్దబావమరది వంకా చూశాడు. నిజానికి మంచిపనే చేశాడు. కోప్పట్టను మంచిదే. కాని తన సంగతి ఏమిటి? "తానూ ఆపనే చేస్తున్నాడే? ఆయనకు చెప్పేవాళ్ళు యెవరు!" అని ఆమెగారు అనుకొన్నది. పైకి మాత్రం "మంచిపనే చేశారు; నిజమే, వాడు ఎందుకూ పనికిరానివాడుగా అయిపోతున్నాడు," అన్నది.

అక్కడేవుండి, అదంతా చూస్తూ వింటూన్న పెద్దబావమరది, "నిజమే నే అక్కయ్యా! కాని మనకంటే కాస్తనయం కదూ?"...అన్నాడు, బావగారివంక చూస్తూ, "వాడికి తాను చెడిపోతున్నట్టు జ్ఞానమైనా వున్నది. బావగారికి అదీ లేదు అన్నమాట!" ఎంత నాజూకుగా అన్నాడు. మందలింపుకు మందలింపూ ఉంది; హాస్యానికి హాస్యమూవుంది. ఇటువంటి బావమరదులు, మందలింపులు జీవితానికి పన్నీటి జల్లులు.

పువ్వులోని పరిమళమువలె, మిత్రుని వాక్కులలో వుండే అమృతమువలె, ఇవి మనోజ్ఞమైన సరసాలు. ఇంకొక గృహస్థు బావమరది, మరొక తమాషా పద్ధతిలో బావగారిని మృదువుగా మందలించాడు. ఆయన ప్రతిదినమూ రాత్రి తొమ్మిదిన్నర, పదింటికి గాని ఇంటికి వచ్చేవాడు కాడు. అంతవరకు కనిపెట్టుకొని కూర్చోవడము భార్యకు కష్టంగా ఉండేది. పిల్లలు ఆయన వచ్చేసరికి నిద్రపోతూవుండేవారు. పొద్దున పిల్లలు నిద్రలేవటానికి పూర్వమే ఆయన స్నానాది కృత్యములు నెరవేర్చుకొని, కాఫీ త్రాగి పనిలోకి వెళ్ళిపోయేవాడు. ఇల్లాగ సంవత్సరాలు గడచిపోయినవి. పిల్లలు తండ్రిని చూచి ఎన్నాళ్ళయిందో!

బావమరది ఒక మంచివుపాయం ఆలోచించాడు: ఆరోజు పిల్లలనుతల్లిమధ్యాహ్నం బాగా నిద్రపుచ్చి సాయంత్రం అలంకరించి మంచి దుస్తులు వేసింది.

మేనమామ వాళ్ళను దగ్గర కూర్చోబెట్టుకొని కబుర్లు చెబుతూ బావగారు వచ్చిందాకా నిద్రపోనీయలేదు బావగారు రావడంతోనే పిల్లలందరినీ వరుసగా నుంచోబెట్టి వాళ్ల తండ్రిని చూపిస్తూ, "నాయనా మీ తండ్రి! చాలా యోగ్యులు. పేరు సుబ్బారావుగారు. డబ్బు కూడా చాలా సంపాదించారు" అని చెప్పి, ఎరుకపరచి, "నమస్కరించండిరా!" అని బావగారితో, "వీరు సుబ్బారావుగారి పిల్లలు" అని చెప్పాడు. సుబ్బారావుగారు కూడా హాస్యప్రియుడు కావడంచేత చాలా సంతోషించినట్లు ముఖంపెట్టి అల్లాగా! చాలా సంతోషం. వినడమేగాని ఈ పిల్లలను ఎప్పుడూ చూడలేదు. సుబ్బారావుగారు చాలా ధన్యజీవి వారిని అభినందిస్తున్నాను అని భార్యవంక తిరిగి "ఈబిడ్డల తల్లిగారు తమరేనా?" అని చిరునవ్వు నవ్వి, బావమరదివంక తిరిగి "ఈరోజు సుదినం. ఈ కుటుంబంతో పరిచయమైనందులకు నేను చాలా గర్వమునూ సంతోషమునూ పొందుతున్నాను" అన్నారు. సరదాకు బావమరది ప్రారంభించిన నాటకము చివరిదాకా లాగినాక, ఆయనకు అవిషయం చక్కగా అర్థమైంది. మర్నాటినుంచి చాలా పెందలాడే ఇంటికి రావడము మొదలుపెట్టాడు. భార్యగాని, బావమరిదిగాని, మరదలుపిల్లగాని వేళాకోళముచేసినా, హాస్యమాడినా ఇట్లా వుండాలి. అంతేగాని ఒకరిపై ఒకరు రాళ్ళవంటి హాస్యపు పలుకులు విసురుకోవడము హాస్యమంటే ఏమిటో ఎరుగని ఆరామకృష్ణకవికి, తిమ్మనకవికే సరిపోయింది.

ఈ బావమరదుల హాస్యవచన ప్రతివచనములవలన ఇంట్లోవున్న అందరూ అనురాగం కలవారు అవుతారు. ఒకరియెడల ఒకరికి సానుభూతి, అనురక్తి ఏర్పడుతవి.

బావమరది పరిహాసోక్తులకు ఇంటావిడ ఇసిరింతలు, మరదలుపిల్ల దిసంతులు, అత్తగారి అణకింతలు, స్నేహితుల కోడిగాలు కూడా తోడైతే గృహం నందనవనం, స్వర్గధామము కావడానికి సందేహం లేదు.

ఈ సాంసారిక హాస్యమువలన తృప్తి, ఆనందము కలుగుతున్నవి. హాస్యవచనములయందు అనురక్తి వృద్ధి అయినకొద్దీ, హృదయ నైర్మల్యమూ, రసగ్రహణపారీణతా, ఆరోగ్యమూ ఎక్కువ అవుతవి. ఈ సాంసారిక హాస్యమే లేకపోతే ముక్కు పొడిగించుకొని ఒకరు, మూతిముడుచుకొని ఒకరు, కోపాలతో ముకుళించుకుపోయిన ముఖాలతో కుటుంబములోనివారంతా ఎడముఖము పెడముఖముగా వుంటారు.

ఈస్థితిని పోగొట్టి అందరి ముఖాలను వికసింపచేయగల శక్తి ఈ సాంసారిక హాస్యానికి వున్నది. విచ్చిన తామరపువ్వులతో భాసించే నిండైన తటాకము, వికసించిన ముఖాలతో హసించే కుటుంబము ఈ రెండూ ఈ దుఃఖభూయిష్ఠమైన ప్రపంచంలో వున్నవారికి, స్వర్గసౌఖ్యాన్ని ఊహించుకోటానికి తోడ్పడే ఆధారాలు

—విజయవాడ రేడియో సౌజన్యంతో]

# రాజారావు

మునిమాణిక్యం నరసింహారావు



రాజారావు భార్య చిన్నతనంలో ఎప్పుడో పోయింది. మళ్లీ వివాహం కాలేదు. ఇంకేం అవుతుంది! నలభైఏండ్లు వచ్చినవి!

అతడు ఎల్లాగ బ్రతుకుతున్నాడో ఎవ్వరికీ తెలియదు. ఉద్యోగం సద్యోగం లేదు. ఇల్లూ వాకిలీ లేదు. నా అన్నవారు లేరు. ఎక్కడో తినేవాడు. ఒక స్నేహితుని ఇంట్లో మటుకు అతనికి గది యిచ్చారు ఉంటానికి.

ఎప్పుడన్నా పత్రికలకు ఒక కథో వ్యాసమో వ్రాస్తాడు. దానివల్ల ఓ అయిదు రూపాయలు వస్తవి. ఆ అయిదు వచ్చిన రోజు సాయంత్రానికి కనపడవు. రేపు అనే రోజు ఎట్లాగ గడుస్తుంది అని అతను ఎప్పుడు ప్రశ్నించుకోలేదు.

ఒక పద్యమైనా వ్రాయలేదు అతడు. అయినా అతనిని అంతా కవి అని పిలుస్తారు. ఎవరైనా కాఫీహోటలుకు రమ్మంటే వెడతాడు. సిగిరెట్టు ఇస్తే తాగుతాడు. అంతేకాని నాకు ఇది కావాలె ఇప్పించుమని అతడెవ్వరినీ అడగలేదు.

అతడు ఎప్పుడు కులాసాగా ఉంటాడు. చిరునవ్వు అతని పెదవులపైన ఎప్పుడూ నృత్యంచేస్తూ ఉంటుంది అతడు అంత దారిద్ర్యం అనుభవిస్తూ కూడా సంతోషంగా ఉంటాడు. నవ్వుకుంటూ బ్రతుకుతాడు.

అన్నంతిన్న రోజునా నవ్వుతూ ఉంటాడు; తినని రోజునా నవ్వుతూనే ఉంటాడు.

మనిషైనవాడికి ఎన్నో విచారాలు ఉంటవి. బట్టలు లేవనీ, తిండి లేదనీ, ఉంటానికి ఇల్లు లేదనీ! ఇవన్నీ ఉంటే భార్యా పిల్లలు లేరని! వాళ్లుఉంటే ఉన్నారనీ, ఇల్లాగ మానవుణ్ని ఆశ్రయించుకొని ఎన్నో పిల్లదుఃఖాలు పెద్ద దుఃఖాలు బ్రతుకుతున్నవి. ఈ మనిషికి ఏ దుఃఖమూ లేదు, విసుగు లేదు, చిరాకు లేదు. ఒక్క చిరునవ్వు అనే ఖడ్గంతో, ఏ దుఃఖమూ తన దగ్గరకు రాకుండా కాపాడుకొంటున్నాడు.

జీవితాన్ని ఇంత ధైర్యంగా ఎదురొక్కగలిగిన ఈ వ్యక్తి, పెండ్లిచేసుకొంటే?

'భార్యా, పిల్లలు, సంసారం ఏర్పడ్డతరువాత ఇతని జీవితం ఇల్లాగ వెన్నెలరాత్రిలాగ ఉంటుందా, అప్పుడు తెలిసివస్తుంది జీవితం అంటే ఏమిటో. ఇప్పుడు ఒంటరిగాడు కాబట్టి ఏదో నెట్టుకొస్తున్నాడు.' ఇల్లాగ అనుకొన్నాము మేమంతాను.

ఈమధ్య రాజారావు రెండు సంవత్సరాల పాటు కనపడలేదు. ఎక్కడికి వెళ్ళిందీ ఎవ్వరికీ తెలియదు. యుద్ధంలోకి వెళ్లాడనీ, బహుశః వెళ్ళిపోయిఉంటాడనీ అంతా అనుకొన్నారు.

ఉన్నట్లే ఉండి ఒకరోజున హఠాత్తుగ ఊడిపడ్డాడు. బజార్లో దువ్వెనలూ సబ్బులూ వాసననూనెలూ అల్లాంటి వస్తువులు అమ్మే షాపులో ఏవో కొంటూఉన్నాడు.

ఆ ముఖం ఎప్పటిలాగ కళకళలాడుతూ ఉంది. మళ్లీ నవ్వుతూ పలకరించాడు.

అతని ప్రక్కన ఓ ముసలమ్మ ఉంది!

రాజారావుకు తల్లి గాని, పెద్ద అక్కగారు గాని లేదు. ఆ విషయం మాకందరికీ తెలుసు.

ఆ ముసలమ్మ ప్రక్కన నుంచుని ఆవిడగారికి వాసననూనెలూ, సెంట్లుబుడ్లూ అవీ కొనిపెడుతున్నాడు. ఆ ముసలమ్మ ఎవరుఅయి ఉంటుంది, మేమంతా ఆశ్చర్యపోయినాము.

'మీ పిన్ని?' అని అడిగాము. వాడు తల త్రిప్పి కాదని సూచించాడు.

'మీ అక్కగారా?

మళ్లీ తల తిప్పాడు.

ఆమె వీడికి బంధువు కాదన్నమాట!

అయితే ఎవరైనట్లు?

ఆమె వీడికి బంధువు కాదుగదా అన్నధైర్యంతో 'ఎవర్రా ఈ ముసలది?' అన్నాము.

వాడు అన్నాడు — మీరు నన్ను క్షమించాలె. నేను మీకు చెప్పలేదు. నేను వివాహం చేసుకొన్నాను.

---

'అయితే అత్తగారా బాబూ ?' అన్నాము.

'కాదు నా భార్య' అన్నాడు రాజారావు.

మాకు నిలువుగుడ్లు పడిపోయినయి. భార్య! ఇదేం భార్య! వీడా నలభై ఏండ్లలోపు-ఆమెకు 60 ఏండ్లు పైన! ఇదేం దాంపత్యంరా రామచంద్రా! అని మేము ఆశ్చర్యపడి నిశ్చేష్టులమై పోయినాము.

వాడు అన్నాడూ 'ఏ భవనములో కురంగనయన అయిన గృహిణి కనబడదో ఆ భవనము సకల సంపత్తులతో కూడుకొన్నప్పటికీ వనమే అవుతున్నది కాని భవనము కావటములేదు. గృహానికి గృహలక్ష్మి ఉండాలె.'

నిజమే అనుకో, ఇదెక్కడి కురంగనయనరా నిన్ను తగలెయ్య!

ఆమెగారి రూపం చూస్తే ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది.

తల నెరిసి ఏకులబుట్ట అయింది!

మెడక్రింద చర్మం ముడుతలు పడ్డది!

చేతులూ కాళ్లూ ఎండిన కాష్ఠాకృతి!

సొట్ట బుగ్గలు!



పీక్కుపోయిన కళ్లు!

ఒంటిమీద ఒక నగ అయినా లేదు!

జేనికి ఆశపడి చేసుకొన్నట్లు!

వాడిని కొంచెం ఇవతలకు పిలిచి ఏమైనా మనస్సులో కష్టపడతాడేమోనన్న ఆలోచన అయినా లేకుండా అన్నాము 'ఏమోయ్ ఎక్కడ సంపాదించావు ఈ ముసలి తొక్కను!!'

ఈ మాటమీద వాడికి కోపంవస్తుందని భయం వేసింది.

రాజారావుకు కోపం రాలేదు.

నవ్వాడు.

ఇంకా ఏదో మాట్లాడాలనుకొన్నాము ఆమెను గురించి. వీడైతే నవ్వు ఊరుకొన్నాడు. ఆవిడ వింటే పోట్లాటకు రాదూ! అందుకని వాడికి మాత్రము వినపడేటంతటి తగ్గు గొంతుకతో ఏదో అనబోతుంటే వాడు మా మాటకు అడ్డొచ్చి అన్నాడూ 'ఫరవాలేదు పెద్దగా మాట్లాడు. ఆమెగారికి పుట్టెడంత చెవుడు! అరచి చచ్చినా వినపడదు!'

ఈ ఆకారానికి తోడు అది కూడానా! అని నవ్వాము.

వాడు సంతోషంతో 'కళ్లు కూడా సరిగ్గా కనపడవు!' అని ఇంకొక విషయాన్ని కూడా బైటపెట్టాడు.

మేము ఆశ్చర్యపడి నుంచుంటే వాడు సంతోషంతో ఊగుతూ 'పళ్లు లేవు! అవి కట్టుడు పళ్ళు' అని పకపకా నవ్వాడు.

అంతటితో ఆ సుందరి సౌందర్యవర్ణన పూర్తి అయింది.

వాడికి విచారంలేదు. పైగా ఎంతో సంతోషిస్తున్నాడు.

మమ్మల్ని తీసుకొని వెళ్ళి, ఆమెకు ఎదురుగా నుంచోబెట్టి— వీరు మా స్నేహితులు అని పెద్దగా అరిచి చెప్పాడు.

ఆవిడ సంతోషించింది.

వాడు మాతో ఇల్లా అన్నాడు; 'ఇప్పుడు జీవితం, సుఖంగా ఉందోయ్......ఇన్నాళ్ళకు ప్రేమ అంటే ఏమిటో తెలిసింది.'

ఆ తరవాత రాజారావు, ప్రేమగా భార్య చెయ్యి పట్టుకొని బండిదగ్గరకు నడిపించుకు పోయినాడు.



# లేచి పోవాలను కొంటే

మునిమాణిక్యం నరసింహారావు

తలుపు నెట్టి విసురుగా, ఇంట్లోకి ప్రవేశించి అన్నాను, నేను వెడుతున్నాను. ఇక మనకు కుదరదు లే' అని.

"నేనేంజేశాను? మీకంత కోపం రావటానికి! ఏదో సంసారంలో, భార్యాభర్తలన్న తరువాత పోట్లాటలంటూ వస్తే సద్దుకు పోతారుగాని తెంచుకు పారిపోతారా?"

"........................"

"మాట్లాడరేం? ఎక్కడైనా ఉందండీ ఇల్లాంటి వైపరీత్యం? సంసారం గుట్టు, రోగం రట్టు అన్నారు. మీరు నన్నిలా అల్లరి పెట్టడం ధర్మం కాదు. అయినా ఇంతకూ నా తప్పేముంది?

"మళ్లీ యాకరు పెట్టుకుంటావా మొదటినుంచీ?"

"వద్దు, బాబూ వద్దు. మళ్ల మొదటికి తీసుకురాకండి.

"అయితే నీవు మాట్లాడక....సుశీ, అట్లా రోడ్డుమీద కెళ్లి ఒక బండి తీసికొనిరా?

"ఉండవే, అమ్మాయ్, అయితే ఎక్కడకీ ప్రయాణం ఒక్క మాట చెప్పండి?

"ఎక్కడికైతే నీకెందుకు? ఎక్కడికో వెళ్లిపోతాను."

"బండి తేనా, నాన్నా."

"ఇంకా, ఇక్కడే ఉన్నావుటే?"

"అయితే వెళ్లిపోవటం నిశ్చయము అన్నమాటే!

"నిశ్చయమా అని మెల్లగా అడుగుతున్నావేమిటి? వెళ్లిపోతుంటే, అన్నాను దుఃఖాన్ని దిగ మ్రింగుకొని.

"మళ్లీ ఎప్పుడు వస్తారు?"

"నీ కేం, వేళాకోళంగా ఉందా ఏమిటి? ఇదే ఆఖరుసారి ఈ ఇంట్లో................"

అనేసరికి అప్రయత్నంగా నా గొంతుకలోకి సన్నని వణుకు వచ్చింది: ఆ రోజున నేనన్న మాటలు హాస్యానికి కాదు. అట్లా ఒక నాటకం ఆడానని అనుకోలేదు.

నిజం. దైవ ముఖాన చెబుతున్నాను. నిజంగా సంసారం త్యజించి పోదామనే ప్రయత్నం. సౌఖ్యం లేకపోయిన తరువాత జీవించటంవల్ల ప్రయోజనం ఏముంది? అల్లా అని ప్రాణత్యాగం చేసుకోలేము. ఏదో ఇదివరలో సంపాదించి, పెద్దలు ఇచ్చిపోయిన బాపతు

ఆస్తివలన జీవనం గడుస్తుంది మా సంసారానికి నేనున్నా, లేకపోయినా.

కాంతం సంగతా అయిపోయినవి సౌఖ్యదినాలు.

ఇకముందు నా జీవితానికి అంతా అమావాస్యేగాని వెన్నెల దినాలు రాబోవు.

పిల్లల సంగతో, భగవంతుడే ఉన్నాడు! ఎందుకు జీవిస్తున్నట్లు నేను! సంపాదించి మేడలూ మిద్దెలూ కట్టడం లేదు. సాహేబు సంపాదన బూబమ్మ కుట్టుపోగులకు సరి, అన్నట్లుంది నా సంపాదన. నే జేసేలోకోపకారమా, సున్నాకు సున్నా, హళ్లీకి హళ్లీ. ఇంకెందుకు ఈ గంపెడు సంసారాన్ని ఈదటం? నేను లేక పోయినా గడిచిపోతుంది. అంచేత





దుఃఖ జనకమై కేవలము మిథ్యయైన ఈ సంసారాన్ని వదిలేసి ఇతర దేశాలలో అజ్ఞాతంగా తిరుగుతూ భక్తిని అలవరించుకొని, ముక్తిని సాధిద్దామని ఆరోజు నిజంగా అనుకొన్నాను. నిజమంటే నిజం.

అయితే ఆవిడకు మాత్రం నా నిజోద్దేశం చెప్పినా నమ్మలేదు.

"నిజంగా వెడతారా."

"ఆ............."

"సరే! వెళ్లేవాళ్లను పట్టుకొంటె మటుకు ఆగుతారా? వక్కమాటు ఇలా చూడండి. పసిదికూడా వస్తుందట! ఎట్లా దూకుతుందో చూడండి! ఒక్కమాటు తీసికొండి!"

"ఒక్కసారి కాదు గదా. అరసార్లైనా తీసుకొను.

తెంపుకు పోతున్నవాడిని ఈ ప్రేమబంధాలతో ఎందుకు కట్టిస్తావు? పొయ్యేవాడ్ని పోనీ, అడ్డురాకు.

"..............."

"నవ్వుతావూ! నీకేం తెలుస్తుంది నా కడుపులో పుట్టిన ఆందోళన, నాకు వద్దు ఈ సంసారం...నరకం...

సంఘం, శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి

"అబ్బ, ఎంత కఠినమండీ, సాక్షాత్తు బుద్దదేవుల్లె పోతున్నారే! బుద్ధదేవుడు కూడా మహాభినిష్క్రమణానికి ముందు భార్యా పుత్రులవంక ఒక్కసారి ప్రేమదృక్కులు ప్రసాదించాడు. తెలియదండీ!"

"అయితే సరే, ఒక్కసారి ఇయ్యి. ఒకసారే. ఒక గాఢాలింగనం..........ఒక్క చుంబనం............ సరి తీసుకో...నన్ను బంధించక.........బుద్ధం శరణం గచ్ఛామి......

"రావటం లేదు. మీ దగ్గరనుంచి."

"తీసుకో...ఇంద...ఊ."

"రానంటుంటే...దాన్నికూడా తీపికెళ్లండి. జాగ్రత్తగా పెంచండి. శిష్యురాలౌతుంది!"

"మరేం అక్కర్లేదు...ఇంద"

"నిజంగా వెడతారా?

"వెడుతుంటేనే...పిల్లలను జాగ్రత్తగా పోషించుకో అవున్నది చాలు, లేదనకుండా గడవటానికి, అని గిరుక్కున తిరిగాను. ఇటు మాదునుగదా పిల్లలంతా ఎక్కడికో ప్రయాణ సన్నాహంలో ఉన్నారు. కాంతంతో అన్నాను.

"వీళ్లను నామీదికి తోలే వేమిటి? వీళ్లను తీసుకుపో. నేను వెళ్లిపోతాను. ఈ చివర రోజునకూడా నీవు నాకు అనుకూలవతివి కావూ?" అన్నాను కంపిత కంఠంతో.

"వారు నామాట వినరు. మీరే చూచుకోండి ఆ విషయం." అంటూ కాంతం చెరచెర నడిచిపోయింది.

"ఒరేయి ఏమిటిది బూడ్సులు తొడుగుతున్నావేం దుకు?"

"నేనూ, వస్తానాన్నా."

"అదేమిటే అమ్మాయి?

"............"

"నువ్వెక్కడికే సుశీ?"

"............"

"నువ్వెందుకురా, అట్లా చిందువేస్తావు.?"

"నేనూ, వస్తాను నాన్నా.

"నేనూ......"

"నేనూ...నాన్నా"

"నేనూ......"

"ఊ...ఊ...ఊ...ఊ..."

"ఓరి వెధవల్లారా. ఎక్కడికి వస్తారు. ఎక్కడికిరా వస్తారూ అంటూ? అమ్మ ఉప్మా చేసింగి. పొండి?"

"ఊహు...ఊహు...ఊహు"

"ఎక్కడికి వస్తావురా?"

"నీవు ఎక్కడికి వెళుతున్నావు?"

"నేను వెళ్లిపోతున్నాను"

"ఊ...ఊ..."

"నేను...వస్తా...నాన్నా..."

"ఓరి వెధవా నేను సంసారం వదిలేస్తున్నా."

"నేను వదిలేస్తా నాన్నా..."

"ఓరి గాడిదా, సన్యాసం పుచ్చుకోటానికి వెడుతున్నానురా"...అన్నాను విసుగ్గా...

"నేనూ, పుచ్చుకొంటా నాన్నా" అన్నాడు మా అయిదేండ్ల చిన్న వెధవ.

"నేనూ నాన్నా అని బిక్కముఖం వేసింది సుశీ"

ఈ చిన్న వేదనలంతా నాతోపాటు సన్యాసం పుచ్చుకుంటామంటూ బయలు దేరారు. బుద్ధదేవుడికి ఒక్క కొడుకు కాబట్టి తెంచుకు పారిపోయినాడు. అదీ నిద్ర పోతున్నప్పుడు! అదీ అర్ధరాత్రి! అసుర సంధ్యవేళ అరడజను పిల్లలను వదిలించుకొని వెళ్ళవలసి వచ్చినట్లయితే తెలిసేది, ఈ సంసారానికి మానవుడు ఎట్లా కట్టుబడి ఉన్నాడో!

## 3

కుర్చీలో కూలబడ్డాను కదలకుండా మెదలకుండా: పిల్లలు నా ముఖం వంక చూశారు. నేను నవ్వకుండా, గంభీరంగా ఉండటం చూచి పెద్దపిల్లలు ఒక్కరొక్కరే జారారు.

చిన్నవాళ్లు ఏడుస్తూ, తల్లిదగ్గరకు పోయినారు. కళ్లు మూసికొన్నాను.

చెన్నుడు కోటవెలుపల గుర్రాన్ని తయారుచేసి ఉంచి సిద్ధంగా ఉన్నట్లూ, బుద్ధదేవుడు గంభీర వదనంతో, భార్యా పుత్రాదులను, ధన సంపదలనూ, సర్వమూ త్యజించి, ఆతురలో వస్తూ ఉన్నట్లు, నాకొక దృశ్యం కనపడ్డది. బుద్ధదేవుడ్ని ప్రార్థనచేసి, నేనూ, ఒక్కమారు, ఇంటిని నాల్గు దిక్కులా చూచి, నిట్టూర్పు విడిచి, గుమ్మం దాటి బైట పడ్డాను ఈ విశాలమైన ప్రపంచంలోకి.

## ౪

వీధి మలుపు తిరిగాను. బుద్ధదేవుడ్ని ధ్యానిస్తూ వెనకాలనుంచి కెవ్వున కేకేసి పరుగెత్తికొని వస్తున్నారు రాధా విజయలు. పెద్దవాడు లాగూ, చొక్కా, కోటూ వేసికొని, బూడ్సులు తొడుక్కొని, చెమ్కి టోపి పెట్టుకొని నాకు నాల్గు గజాల దూరంలో ముందు నడుస్తున్నాడు,—నేను రావటాన్ని గమనిస్తూ, మాటిమాటికి వెనక్కు తిరిగి చూస్తున్నా. పెద్దపిల్లలిద్దరూ కొత్త పరికిణీలు కట్టుకొని కొత్త చొక్కాలు తొడుక్కున్నారు. వాళ్లమ్మ నడిగి తీసుకొన్నారు కాబోలు బంగారు గొలుసులు మెడలో మెరుస్తున్నవి. దూరంగా రోడ్డుమీద నుంచుని నేను పోవలసిన దారినే ముందుగా గబగబ నడుస్తున్నారు. త్రిరత్నాలను నేను మరోసారి స్మరించుకొన్నాను.

వీళ్లం జూచి నేను తెల్లబోయినాను. అమ్మాయిలను పిల్చి “వెళ్లండే యింట్లోకి” అన్నాను. వాళ్లు “మేము వేరే పనిమీద వెడుతున్నాము ఇంకొకచోటికి. నీతో రావటం లేదు” అని కిలాకిలా నవ్వుతూ దూరంగా నుంచున్నారు.

“నువ్వెక్కడికిరా పోరా” అన్నాను దగ్గరనున్న వెధవతో.

“నేను వస్తాను నాన్నా,” అని మళ్లీ అన్నాడు వాడు బిక్కమొఖం వేసి.

“నేను ఎక్కడికి వెడుతున్నాననుకొంటున్నావురా,” అన్నాను.

“అమ్మ చెప్పిందిలే నాన్నా. అక్కయ్యలు రావటం లేదేం? అదుగో వాళ్లు నీకంటె ముందె అక్కడుంటారు.

“ఎక్కడుంటారురా?”

“అక్కడే!...”

“ఎక్కడరా! ఏమని చెప్పింది అమ్మ.”

“............”

“నేను వస్తాను నాన్నా, మొన్నకూడా రాలేదూ”

“ఎక్కడికి వెడుతున్నాననుకుంటున్నావు చెప్పవేం?”

“అమ్మ చెప్పిందిలే నాన్నా నీవు సినిమాకు వెడుతున్నావని”

“ఆ...ఆ...”

తెల్లబోయినాను. పిల్లలిద్దరూ కాళ్లకు చుట్టేసుకొని ఏడుస్తున్నారు. ఆ వీధిలోని ఆడవాళ్లు కిటికీలోనుంచి చూస్తున్నారు. అసహ్యమనిపించింది. పసిదాన్ని, చిన్నవాడ్ని, రెండు చేతుల్లో యెత్తుకొని మళ్లీ గుమ్మంలోకి

వచ్చేను. పెద్ద వెధవ ఇష్టంలేక ఇష్టంలేక మెల్లగా అడుగులో అడుగు వేస్తున్నాడు నా వెనకాల. నేను గుమ్మం దగ్గరకు వెళ్లి తలుపు కొట్టాను.

౫

"ఎవరది? చెయ్యి ఊరుకోలేదు వెళ్లండి."

"తలుపు, తలుపూ"

"............"

"తలుపూ, అయ్యో, తలుపు తియ్యవే!"

"ఎవరా, తలుపూ"

"నేనే..."

"అంటే..."

"అబ్బ... నేనే"

"ఎందుకూ?"

"తీయి, చెబుతా?"

"ఏమిటి చెప్పేది? సంసారంపైన విరక్తి పుట్టిపోయినవాళ్లకు అప్పుడే ఇదేం వికారం?"

"కాదులే, చెబుతా, తలుపుతీయి"

"కాదేమిటి? చెప్పేదేమిటి! మళ్లా ఎందుకొచ్చారు? ఈ కూపంలోకి; వెళ్లండి, వెళ్లండి."

"ఒక్క మాట."

"మాటా లేదూ, గీటా లేదూ, వెళ్లండి."

"మాటు, మాటంటుంటే."

ఇంకేం, మాటలు లెద్దురూ?"

"అబ్బ చాల్లే! తలుపుతీయి, చేతులు పీకుతున్నాయి." అన్నాను.

మా అబ్బాయి "వద్దు నాన్నా, వెడదాం రా నాన్నా, అమ్మ తీయకపోతే ఏం? భయమా?" అన్నాడు.

"ఇంకేం, వెళ్లండి, కొడుకు చెబుతున్నాడుగా సలహా" అంటూ తలుపుతీసింది కాంతం.

"ఎందుకూ, మళ్లీవచ్చారు?" అన్నది అణచిపెట్టుకొన్న నవ్వుముఖం అంతా కలయబారింది.

"మరి వీళ్లంతా?"

"నన్నేమి చేయమంటారు?"

"నువ్వు చేసిందే కాదూ, ఇదంతా?"

ఈ మాత్రం జయించలేని వాళ్లేనా, ప్రపంచాన్ని జయించటానికై బయలుదేరారు?" అన్నది ఈసడింపుతో పసిదాన్ని అందుకొంటూ.



"నిజమేలే! ఇకలే అడ్డం...అన్నాను విసుగ్గా."

"ఊహు..."

"అదేమిటి అల్లాగ నుంచుని లేవవు...పేరు చెప్పిస్తావా ఏమిటి?"

"అటువంటిదే?..."

"ఏమిటది?"

"ఒప్పుకోండి, ఓడిపోయినానని."

"సరే, ఓడిపోయినాను. ఇకలే! వీధిలో ఆడవాళ్లం దరూ కిటికీలలోనుంచి చూస్తున్నారు."

"లేకాదు. హ్యాండ్స్ అప్, (Hands up) నెపోలియన్ ఓడిపోయి ఆంగ్లేయుల ఎర్ర పతాకానికి సలాం చేసి చేతులెత్తలా! అట్లా!

"చిత్తం", అని సలాంచేశాను. గాలికి కాంతం పమిట విప్పారి టపటప కొట్టుకొన్నది.

...............

"ఏమిటది?"

"ఏం, లేదు, పత్రులు గూండ్లను చేరుతూ కిచకిచ లాడుతున్నాయి"

"కాదు, కాంతం, ఎవరో నవ్వుతున్నారు."

"కాదు రండి."

దభీలుమని తలుపు వేసింది కాంతం.—

# హెడ్ మాస్టరు

మునిమాణిక్యం నరసింహారావు

తెలుగులో ప్రధానోపాధ్యాయుడు అనబడే వ్యక్తినే అందరూ హెడ్‌మాస్టరు అంటారు. సృష్టిలో ఈ ప్రధానోపాధ్యాయుని స్థానం ముందుగా నిర్ణయించవలసి ఉన్నది. సృష్టి జడము అజడము అని ద్వివిధము. అజడజగత్తును జంతువులు, జంతువులు కానివి, (Animals and non-animals) అని రెండు విభాగాలు చేయవచ్చును.

జంతువులలో మనుష్యులూ, మనుష్యులు కానివి, అని రెండు విభాగా లున్నవి.

ఆ మనుష్యవర్గములో ఉపాధ్యాయులు ఉపాధ్యాయేతరులు అన్న విభాగాలు కూడా ఉన్నవి. కార్మికులు, కర్షకులు, వర్తకులు, గుమాస్తాలు మొదలైనవారు అంతా ఉపాధ్యాయేతరులు అనబడే విభాగంలోకి వస్తారు.

మళ్లీ ఉపాధ్యాయులు అనబడే సమూహాన్ని తీసుకొని, దానిని ప్రధానోపాధ్యాయులు సహాయోపాధ్యాయులు అనబడే వర్గాలుగా విభాగంచేస్తే, సృష్టిలో ప్రధానోపాధ్యాయుని స్థానం విశదము అవుతుంది.

అంటే తర్క రీత్యా, జంతు రాజ్యంలో (Animal Kingdom) ఒకరకము మనిషిని ప్రధానోపాధ్యాయుడు అంటారు.

ప్రధానోపాధ్యాయుడు మనిషి అని నిర్ణయం కుదరడముతోనే, కొన్ని ఉప నిర్ణయాలు (immediate inferences) తత్క్షణం చేయడము సాధ్యము అవుతుంది.

అవి ఏవి అంటే, ప్రధానోపాధ్యాయునికి కూడా ముక్కు, నోరూ, చేతులూ, కాళ్ళూ మొదలైన అవయవాలు ఉంటాయనీ, మానవజాతికి సహజమైన ఈర్ష్య, అసూయ, కోపమూ, లోభమూ, మదమూ, మాత్సర్యమూ మొదలయిన గుణాలు ఉంటవి అనీ చెప్పవచ్చును.

ఇవన్నీ ఎందుకూ, ఏమంత గొప్ప విషయాలు అని అనుకోవచ్చు ఎవరైనా. నాకూ తెలుసు ఇవి గొప్పవిషయాలు కావని. కాని ఒక పదార్థముయొక్క తత్వ స్వరూపములను నిర్ణయించేటప్పుడు తర్క రీత్యా పరామర్శ సవిధంగా జరగవలెను. కాబట్టి నేను ఇవన్నీ చెబుతున్నాను.

"ఇమ్మీడియట్ ఇన్ఫరెన్సు అయిపోయిన తరువాత మీడియేట్ ఇన్ఫరెన్సువలన ప్రధానోపాధ్యాయుడు అనే పదార్థాన్ని గురించి మనము తెలుసుకోదగినది ఏమిటి అన్నది రెండవ విషయము.

ప్రధానోపాధ్యాయుడు మనుష్యుడు. మనుష్యులందరికీ చావు ఉన్నది. కాబట్టి హెడ్ మాస్టర్లకుకూడా చావు ఉన్నది.

ఆసంగతి ఎవరికి తెలియదు అని అనటము తర్కశాస్త్ర విధానాన్ని తిరస్కరించడమే అవుతుంది. అరిస్టోటిల్ అంతవాడు సిలోజిజమ్ అనే వాద విశేషాన్ని సృష్టించి సోక్రటీసు మనుష్యుడు కాబట్టి ఆయనకుకూడా మరణము ఉంది అని నిరూపించినాడు. కాబట్టి నేను ప్రధానోపాధ్యాయునికి మరణం ఉన్నదని చెప్పటంలో వైపరీత్యము ఏమీ లేదు అని అంటున్నాను. మానవులలో చాలమందికి పునర్జన్మ ఉంటుంది కాబట్టి హెడ్‌మాస్టరు అయినవానికికూడా పునర్జన్మ ఉంటుంది అనవచ్చును. హెడ్‌మాస్టరు మళ్లీ హెడ్‌మాస్టరుగానే పుడతాడు అని జగన్నాథ భట్టాచార్యుని మతము. అయితే మనుష్యులలో ప్రధానోపాధ్యాయుడు కారణ పురుషుడు అనీ, అట్టివానికి పునర్జన్మ ఉండదనీ వంగదేశములో నైయాయిక రత్నత్రయములో ఒకడు అయిన గంగాధర భట్టాచార్యుడు అంటాడు. కాని దానితో మనకిప్పుడు ప్రమేయంలేదు.

ఇంతవరకు తర్క వేదాంత శాస్త్రముల దృష్టిలో ప్రధానోపాధ్యాయుని ఉనికిని గూర్చి చర్చించినాను.

ఇక చారిత్రకంగా చూద్దాము. చూస్తే భారత కాలంనాటికి ప్రధానోపాధ్యాయులు ఉన్నట్లు కనపడదు. ఆచార్య పదం ఎక్కువగా కనిపిస్తుంది. ఆచార్యుడే ఉపాధ్యాయుడు. కృపాచార్యుడు, ద్రోణాచార్యుడు, భీష్మాచార్యుడు మొదలైనవారు ఉపాధ్యాయులే అయి ఉంటారుగాని ప్రధానోపాధ్యాయులు అయి ఉండరు.

ఉపాధ్యాయులలో భేదప్రభేదాలు బౌద్ధ యుగంలో వచ్చి, దానితరువాత బ్రిటిష్ యుగంలో స్థిరపడిపోయినవి.

ప్రధానోపాధ్యాయుడు అంటే ఉపాధ్యాయులందరిపై అధికారి. రాజులలో ధర్మరాజువలెనూ, పర్వతాలలో హిమాలయము వలెనూ, పుష్పాలలో [illegible] సంపెంగ వలెనూ, మాస్టర్లలో హెడ్‌మాస్టరు రాణిస్తూ ఉంటాడు.

ఆయన కనుసన్నలలో మెలగుతూ ఆయన ఆజ్ఞలను పాటిస్తూ ఉండేవారు సహాయోపాధ్యాయులు అవుతారు.

సహాయోపాధ్యాయులు హెడ్ మాస్టరు ఎడల వినయ విధేయతలు ప్రదర్శిస్తూ, ఎల్ల

# ★ హెడ్ మాస్టరు ★

ప్పుడూ కూడా ప్రణత శిరస్కులై ఉంటూ ఉంటారు.

పాఠశాల ఆవరణలో వారి కీర్తి వ్యాపించి ఉంటుంది. ఆ కీర్తి శరత్కాలపు వెన్నెల వలె ధవళమై నిర్మలమై ఉంటుంది.

పాఠశాల నిర్వహణ భారమంతా వారి భుజస్కంధములపై ఉంటుంది. సిమెంటు కుడ్య పరీవృతమైన ఆ పాఠశాల ఆవరణే ఆయన సామ్రాజ్యము. ఆ సామ్రాజ్యములో శ్రీవారి మాట అనుల్లంఘనీయమైన శాసనము. వారు అచ్చట దుశ్శాసనులు. దుష్కరమైన శాసనములు కలవారు దుశ్శాసనులు అని అర్థము. ఆ పాఠశాలలో ఆ ప్రధానోపాధ్యాయ సర్వేశ్వరుడు శిఖరములయందు కూడు కొన్న చంద్రమండలము కల మేరుపర్వతము వలె భాసిస్తూ ఉంటాడు.

శ్రీ వారు ఎల్లప్పుడూ ధౌతవస్త్రములనే ధరిస్తూ ఉంటారు కాబట్టి మేరుపర్వత సాదృశ్యమును చెప్పవలసి వచ్చింది. వారి శిరోవేష్టమును చంద్రమండలముతో పోల్చుడము కూడా ఉచితంగానే ఉన్నది.

చక్రవర్తులకు వంది మాగధులు ఉన్నట్లుగానే ప్రధానోపాధ్యాయులవారికి కూడా వందిగణము ఉంటుంది.

శ్రీ వారు కృపాసముద్రులనీ, పాఠశాల పరిపాలనా నిర్వహణ కార్యమునందు అతి సమర్థులనీ, సాధువర్తనులనీ, ధర్మాను రక్తులనీ స్తోత్ర పాఠాలు వల్లిస్తూ ఉంటారు ఈ వంది జనులు. సహోపాధ్యాయులే కొందరు వంది జనము అవుతారు.

ప్రధానోపాధ్యాయులు పాఠశాలలో దుర్నిరీక్షులై వైరివీర భయంకరులై ఉంటూ ఉన్నా తదితర ప్రదేశములయందు వారు గంగగోవువలె సాధువులును, గొర్రెవలె అమాయకులును అయిఉంటారని ప్రతీతి (A lamb at home and a lion at School)

డాక్టరు ఆర్నాల్డు అనే ఆయన ఇంగ్లండు దేశంలో ప్రసిద్ధుడైన హెడ్‌మాస్టరు.

ఇంగ్లడు దేశపు ప్రభువైన మూడవ జార్జి ఒకసారి ఆర్నాల్డు పాలిస్తూ ఉన్న పాఠశాలను చూడటానికి వచ్చినాడు. ఆర్నాల్డు, ప్రభువుకు పాఠశాలయొక్క వివిధ భాగాలు చూపునపుడు తానుముందు నడిచి, ప్రభువు తనవెనుకగా వచ్చేలాగున చేసినాడట! అంతేకాక తనశిరస్సుపైనున్న టోపీని (Hat) తీయలేదట! ఇల్లాగ చేయడము ప్రభువును అగౌరవపరచుటే అవుతుంది. అయినా అట్లాగేచేశాడు.

అటుతరువాత ప్రభువువారిని తనగదిలో తీసికెళ్ళి, వినయంగా నమస్కరించి "నేను నాటోపీ తీయకుండా మీముందు నడవడం కూడనిపని అని నాకు తెలియకపోలేదు. కాని నాబాలురు నన్ను సర్వాధికారివలె చూస్తున్నారు. నాకంటే పైఅధికారి ఒకరు ఉన్నారని వాళ్ళకు తెలిస్తే నాకు అపకర వస్తుంది. అందుకని ఆ విధంగా ప్రవర్తించాను. క్షమించు ప్రభు" అని వేడుకొన్నాడట!

హెడ్‌మాస్టరు అయినవాడి చిత్తవృత్తి అల్లాగ ఉంటుంది.

అల్లాంటి హెడ్‌మాస్టర్ల పూర్వం వుండే వారు. వారియెడల విద్యార్థులూ, ఇతర జనమూ కూడా భక్తిప్రపత్తులతోనూ వినయ విధేయతలతోనూ మెలగుతూ వుండేవారు.

హెడ్‌మాస్టరు వస్తున్నారు అంటే ప్రతాపరుద్రుడు వస్తూవుంటే శత్రుమూకలు భయభ్రాంతులై ఏవిధంగా చెల్లాచెదరై పోయేవారో అల్లాగే విద్యార్థులు భయపడి నలుదిక్కులకూ పారిపోయేవారట!

పాఠశాలను పరీక్షించడానికి వచ్చిన ఒకానొక అధికారి ఒక కుఱ్ఱవాడిని అడిగినాడట, మాస్టరుకూ, హెడ్‌మాస్టరుకూ భేదం ఏమిటీ అని.

ఆ బాలుడు ఒకనిముషం ఆలోచించి, గంట కొట్టడముతోనే క్లాసులోకి పోయే

#  హెడ్ మాస్టరు 

గాను మాస్టరు. బెత్తం పట్టుకొని వరండాలో తిరిగేవాడు హెడ్‌మాస్టరు అని జవాబు చెప్పినాడు.

తలకాయ ఉన్నవాడు హెడ్‌మాస్టరు అనీ, తలకాయలేనివాళ్లు వట్టిమాస్టర్ లనీ తికనిర్వచనం కూడా ఉన్నది.

ఈ హెడ్‌మాస్టరు అనబడేవారు స్కూలు వరండాలో తిరుగుతూ ఉంటే కులశైలములయొక్క సమున్నతత్వమూ, సముద్రాలయొక్క గాంభీర్యము, వారిలో గోచరిస్తవి. బాలబాలికలు అందరూ భీతచేతస్కులయి, ఉచితస్థానములలో నిశ్చేష్టులై కాష్ఠాకృతిని పొందుతారు. వారి చేతిలోని బెత్తమును చూచి, వారి కంటి ఎఱుపుజూచి కంపమును పొందని బాలుడు ఉండడు.

ప్రధానోపాధ్యాయులకు సింహతలాటపు కంకణములూ, భుజకీర్తులూ ఉంటే బాగుంటుందని ఈమధ్య ఎవరో ఒక ఉపాధ్యాయుల సభావేశంలో ప్రతిపాదించారు.

అదే సమయంలో విద్యార్థి సభావేశంలో ఒకరు ప్రధానోపాధ్యాయుడు, కాళ్లకు ఎక్కువగా ధ్వనించేటువంటి కంచుగజ్జెలను ధరించాలనీ, వారిచే ఆ పని చేయించుట విద్యార్థుల ప్రథమ కర్తవ్యమనీ, ఈ పని జరుపుటకు విద్యార్థులు ఎంత త్యాగమైనా చేయుటకు సిద్ధంగా ఉన్నారని గంభీరమైన ఉపన్యాసం ఇచ్చినాడు.

కవులు కాళ్లకు గండపెండేరము ధరించిన విధంగానే ప్రధానోపాధ్యాయులు ఈ గండు గజ్జెలను ధరించవలయునని వారివాదన.

హెడ్‌మాస్టరునుగురించి ఇంకా ఒక్క విషయం ఉన్నది చెప్పవలసింది.

ఒక్కొక్కరిని జూచి కొందరు "ఈ ముఖానికేనా హెడ్‌మాస్టరు గిరీ" అంటూ ఉంటారు. "నీముఖానికి తోడు హెడ్‌మాస్టరు గిరీ కూడానా" అనీ, ఇది "హెడ్‌మాస్టరు చేసే ముఖంకాదనీ" ఒక్కొక్కరు ఒక్కొక్కరి విషయంలో అంటూ ఉంటారు.

కన్నే అన్నారు నా మిత్రులు, "ఇది హెడ్‌మాస్టరు ముఖం కాదు" అని.

దీనినిబట్టి ముఖాలలో హెడ్‌మాస్టరు ముఖం అంటూ ఒక రకం ముఖం ఉంటుంది అని స్పష్టంగా తెలుస్తున్నది.

సాముద్రిక శాస్త్రం చూచినా ఈ రకం ముఖాల లక్షణాలు ఎల్లాంటివి అయిఉంటవో నాకు తెలియలేదు.

వాడి ముఖంలో రాజకళ ఉన్నదనీ అనడము మనము తరుచుగా వింటూ ఉంటాము. అల్లాగే హెడ్‌మాస్టరు కళ అని ఒక రకం కళ ఉండి తీరాలి.

హెడ్‌మాస్టరు మాటలలో కూడా ఏదో విశిష్టత ఉండి ఉంటుంది. ఎందుకూ అంటే ఇద్దరు విద్యార్థులు పోట్లాడుకుంటూ ఉన్న సమయంలో అందులో ఒకడు, "ఏమిటోయ్, ఏదో హెడ్‌మాస్టరులాగ మాట్లాడుతావేం!" అనడము విన్నాను. దీనినిబట్టి గ్రహించాను హెడ్‌మాస్టరు మాటలలో కూడా ఏదో గుర్తింపతగిన ప్రత్యేకత ఉన్నదీ అని.

హెడ్‌మాస్టరు పదవి ఎంతో వాంఛనీయమైనదిగా ప్రజలు అనుకొంటారు. ఆ పేరుయందు కూడా జనులకు ఎంతో అనురక్తి ఉన్నది

తల్లి తన కుమారుని భవిష్యత్తును గూర్చి కనే కలలలో, వాడు హెడ్‌మాస్టరు అవుతాడు అన్నది ఒకటి. "మా తండ్రి పెద్ద అయిన తరువాత హెడ్‌మాస్టరు కాడత్తా" అని అందరిలోనూ చెప్పుకొని సంతోషిస్తుంది తల్లి.

తల్లి పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకోవడముకూడా అంతే. పసివాణ్ణి ఎగరేసి ముద్దెట్టుకుంటూ "నా తండ్రే! మా నాయనే! మా హెడ్‌మాస్టరే!" అంటుంది.

ఒక కుఱ్ఱవాడికి పిల్లను ఇద్దామని వచ్చిన వాళ్లు, ఆ చిన్నవాడి బంధువులను అడిగారు, "ఏమండీ, ఆ అబ్బాయి ఎటా ఉంటాడూ" అని. వాళ్లు "ఆ అబ్బాయి క్షేమండి. నిక్షేపంలాగుంటాడు. వెనకాల నుంచి చూస్తే అచ్చంగా హెడ్‌మాస్టరులాగుంటాడు" అని చెప్పుతారు.

ఆ మాటయందు ప్రజలకు అంత ప్రీతి ఉన్నదీ అని చెప్పడానికి పై విషయాలు చెప్పినాను.

ప్రతి పాఠశాలలోనూ ఉండే హెడ్‌మాస్టరును గురించి ఇంతవరకు చెప్పినాను. ఇక చిన్న హెడ్‌మాస్టరును గురించి ఒక ముక్క వ్రాసి ఈ వ్యాసం ముగిస్తాను.

చిన్న హెడ్‌మాస్టరు అను వ్యక్తి హెడ్‌మాస్టరును అనుసరించి ఉంటాడు. ఈ వ్యక్తి ఒక ఛాయాగ్రహము వంటివాడు ప్రత్యేక వ్యక్తిత్వము ఏమీ లేక హెడ్‌మాస్టరును ఛాయవలె అనుసరిస్తూ ఉంటాడు.

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతుంది. ఈ చిన్న హెడ్‌మాస్టరుకూడా తనచుట్టూ తాను తిరుగుతూ పెద్ద హెడ్‌మాస్టరు చుట్టూ తిరుగుతూ ఉంటాడు.

నాయకుడికి, విదూషకుడు ఎంత అవసరమో, నాయికకు మాతి ఎంత అవసరమో, హెడ్‌మాస్టరుకు చిన్న హెడ్మాస్టరు అంత అవసరము. ★

# ముని మాణిక్యం,

రచయిత
మునిమాణిక్యం
నరసింహారావు
(బి.ఏ.యల్.టి.)

* * *

ఆది సాయంసమయము. పశ్చిమ దిక్సతి ఎఱ్ఱనిగన్నేరు పువ్వువంటి చీరగట్టుకొని నిండు చంద్రునిలాంటి బొట్టుపెట్టుకొని, చక్కని చుక్కలలాంటి పిల్లలమధ్య నిలబడి ఉండే సమయము.

పొద్దస్తమానము పొలాన ఉండి సమయానికి ఆవు ఇంటికివచ్చి దూడలమధ్య నుంచుని మాతృప్రేమను ఒలికిస్తూ ఉంటుంది.

పక్షులు గూళ్ళకుచేరి పిల్లలతో కిచకిచలాడుతూఉండే సమయము. ప్రకృతి అంతా ఒక మాతృమూర్తి అయి కనపడే సమయము.

మీరు మా ఇల్లును చూడాలంటే ఆసమయాన్నిరండి. ఎంత హాయి అయిన సమయమది. చల్లని సముద్రపుగాలి మీకు ఎంతో ఉల్లాసాన్ని ఇస్తుంది

తలవంచుకొని నడువవద్దు. చూడండి, అటూ ఇటూ చూస్తూ నడవండి. తల్లులు పసిపిల్లల నెత్తుకొని గుజ్జనకూళ్లు పెడుతున్నారు. ఆమె చిన్నపిల్లవాడి తప్పటడుగులుచూచి మురిసిపోతోంది. ఈమె తన బిడ్డ ముద్దు పలుకులను విని ఉప్పొంగిపోతోంది.

ఇవన్నీచూస్తూ ఆరోడ్డునే సరాసరి వెళ్లండి.

ఆహా ఎంత మంచి సమయము అది; ఆకాశంలో కృత్తిక కనపడుతున్నది. కృత్తికకు మూర్వగా ఎఱ్ఱని రోహిణి మెరుస్తున్నది. దానికి సమీపంలో మృగశిర చుక్కలు మూడు ముచ్చటగా మిసమిసలాడుతూ ఉన్నవి ఆవల ఆర్ద్ర ఎఱ్ఱగా ప్రకాశిస్తూంది. ఆరు నక్షత్రాలముచ్చటైన సమూహంఅది

అయ్యో పిచ్చివాడా ప్రాణం లేని ఆ నక్షత్రసమూహాన్నిజూచి ముచ్చట పడుతున్నావా!

ఆగు.. ఆగు.

అదే మా ఇల్లు.

ఆ అరుగుపైన ఉన్నటువంటి, సజీవమైనటువంటి నక్షత్రమట్కాన్ని జూస్తూ కాస్త నిలవబడు. పిల్లలతోడిలాగ ముచ్చటగా ఉండే, ఆవిడే, దాచటం ఎందుకూ, ఆవిడే మా ఆవిడ.

ఏమిటీ ఆమెపేరు?

సిగ్గుపడతాననుకొన్నారా? ఉంహు. గర్వంగా చెబుతాను మా ఆవిడపేరూ, రాణీసాహెబా, కాంతయ్యమ్మారావు జబ్దతుల్ ఖాకరాన్ సుల్తానా, బీగం.

చూడండి ఆవిడను. మా ఆవిడ అందమైన మనిషికాదూ? అవును. చక్కనిమనిషిమటుకు అవును.

చూడండి ఆవిడ అంత పొడుగూకాదు, అంత పొట్టీగాదూ సరీగా మట్టసంగా ఉంది. అంత అతి చక్కనిదీ కాదూ, అంత అనాకారీగాదు. కాని చూడటానికి మటుకు ముచ్చటగా ఉంటుంది. ఆవిడ అంత ఎరుపూగాదూ, అంత నలుపూగాదు ఆవిడది అదో తమాషాఅయిన రంగు. ఆరంగు ఈలాంటిదీ అని వర్ణించి చెప్పటానికి వీల్లేదు. అదేమిటో ఒక్క చక్కని శరీరచ్ఛాయఅది. మామంచి అందమైనఛాయ.

ఇంటావిడను చూశారుగదా. ఇంట్లోకి వెళ్లండి. ఆ హాలులో పిల్లలు ఎక్కేసైకిల్సు రెండు ఉంటాయి. విరిగిపోయిన రెండు మూడు కుర్చీలు అతిధులను ఆహ్వానిస్తూ ఉంటాయి.

కొంచెం అటూఇటూ చూస్తిరా కనపడతయి విచిత్రమైన వస్తువులు. తోకలు విరిగిపోయినా, పౌరుషంఏమాత్రం తగ్గలేదు, ఆ గుడ్లు ఉరిమి చూస్తూన్న ఆరెండు కుక్కలకూ. అవి మా ఇంటికి కాపలాగా ఉంటూ వున్నవి.

జూలు వేలాడేసుకొని, భయంకరంగా చూస్తూ అక్కడ పడుకున్నదే, అదే మాసింహము. దానికి ఈమధ్యనే ప్రమాదవశంచేత కాలువిరిగింది. మా చిట్టి కెం

**T. Went-worth Pym. D. S. O. M. A. (British Medical Association)**

# యొక్క ఉజ్వలత్వం

*మాపాఠకులలో ఒకరైనను ప్రతికూలాభిప్రాయమును తెలుపకుందురేని కామపురుషార్థవిషయక వ్యాసములను మరికొన్నిటిని మా సక్రమమున ప్రచురింతుము.*

—సంపాదకుడు.

* * *

పాదం వైపు ముడుచుకునివుంటాయి. చేతివేళ్ళు కొంచెం పెద్దవిగా వుంటాయి. ఆబిడ్డ చిన్నారికళ్ళు నీవైపు తేరిపారచూస్తాయి. కాని ఇంకా ఆచిన్నారికళ్ళకు చూసేశక్తి వుండదు. ఆబిడ్డచెవులు శ్రీకారాలలాగున సొంపై వుంటాయి. అవి రూపానికి శ్రీకారాలేకాని వానికి ఇంకా వినేశక్తివుండదు. ఆబిడ్డకు కితకితలుపెట్టడానికి మనం ప్రయత్నించవచ్చు. అట్లా ప్రయత్నించడం మన తెలివితక్కువతనాన్ని తెలియచేస్తుంది. ఏమంటారా ఇంకా ఆబిడ్డకు స్పర్శజ్ఞానం ఏమీవుండదు. కొన్నివారాలు అతిక్రమించేవరకు ఆబిడ్డ చూడడం, వినడం, స్పర్శను అనుభవించడం అనేశక్తుల్ని పొందలేదు. అప్పుడైనా ఆబిడ్డకు పట్టుకోడానికి ఏదైనా చూపిస్తివంటే క్రిందపక్కనిపట్టుకోక పైదిక్కున పట్టుకుంటుంది. ఏమంటారా ఆబిడ్డకు అంతా తలక్రిందులుగా కనిపిస్తుంది. మాసాలు అతిక్రమించినపిమ్మటనుగాని ఆబిడ్డకు ఈతలక్రిందులతనంపోదు. ఈతలక్రిందుల ప్రపంచంలో ఆబిడ్డ ఇట్లుకొంతకాలానికి కాని తలక్రిందులుకాదు. మీరు, నేను అందరమూ ఒకనాడు ఇట్లు తలక్రిందులుగా వుండినవారమే.

ఒకపుష్కరం గడుస్తుంది. బిడ్డ ఏబిడ్డఅయినా— మగ, ఆడవివక్షత లేకుండా— మార్పువస్తుంది.

పండ్రెండుపళ్ళు నిండినమగబిడ్డ! యౌవనప్రాదుర్భావం అయింది. చిన్నతనపుచేష్టల్ని క్రమంగా వదిలేస్తాడు. అతనికి తెలియకుండానే మార్పువస్తుంది. పురుషోచితమైన కృత్యాలు ఎన్నిటిమీదికో అతని మనస్సుపోతుంది. నీళ్ళు పోసుకోమని, మొగంకడుక్కోమని, చేతులు కడుక్కోమని, శుభ్రంగావుండమని ఇప్పుడు తలిదండ్రులు వుపదేశంచేయనక్కరలేదు. లోననుండి వుప్పొత్తుగ వుబికే వుత్సాహంఏదో అతనిచే ఈపనుల్నుచేయిస్తుంది. నీవు నిశితంగా అతన్నిపరిశీలిస్తివంటే— కాని నిశితంగా పరిశీలించవలసిన అవసరమేవుండదు. పరిశీలించకయే చూచినమాత్రాన్నే— అతడు జుట్టువిషయంలో అతిశ్రద్ధచూపుతూవుండడం తెలిసివస్తుంది. చిన్నతనంలో ఏడ్చికాని తలదువ్వించుకోని అల్లరిపిల్లవాడు ఇప్పుడు ఏనప్పుడు... ప్పుడు తలదువ్వమని వేడిస్తూ క్రమ... గా తానే దువ్వుకుంటూవుంటాడు... తలదువ్వుకుని తోడిబాలురతో ఆ... కోడానికి కుతూహలపడతాడు. కం... స్వరంలో మార్పువస్తుంది. ... యరానిగాంభీర్యంఏదో ఆకంఠ... రాన్ని ఆవహిస్తుంది. దుస్తులు... భ్రోగావుండాలనేవాంఛ తీవ్రత... అవుతుంది. ఇన్నాళ్ళు వుంటూ... వున్న ఆడపిల్లల్నిచూసి అసహ్యి... చుకోవడం అనేగుణం ఇప్పుడు ... మంగా తగ్గిపోతుంది. సైగా వా... అంటే ఒకవిధమైన అభిమా... పొడసూపుతుంది. ఈ అన్ని... ర్పులవల్లా నీవు అతనిలో య... ప్రాదుర్భావంజరిగిందని ఆతడు ... హేను, పదహారుపళ్ళవాడు ఆయ... డనీ తెలుసుకుంటావు.

ఆతనిలో కలుగుతూవున్న మార్పుఅంతా ఏమిటి? ఈయ... వనప్రాదుర్భావకాలంఏమిటి? ... మపురుషార్థం యొక్క (సె... [Sex]యొక్క) వుజ్వలత్వం. ఇ... టివరకు ఈసెక్సుభావం ఆతని... నిద్రాణమైవుండినది. ఇప్పుడు వు... లత్వంపొందింది. ఇక జీవితాం... వరకూ అది ఆతనితోనే వుండే... తుంది.

పండ్రెండుపళ్లునిండిన ఆడబి... జీవయాత్రలో మగబిడ్డతొక్క... వచ్చిన మార్గాన్నే ఇంతవరకు ... బిడ్డకుండా తొక్కుతూవచ్చి...

...ని ఆలోక్కుకురావడంలో కొం... చెప్పు మృదుత్వము, నాజూకు ...స్తుంది. మగబిడ్డకంటె ఒకటి ...ండేండ్లు ముందుగానే ఆమెకు ...ప్రాదుర్భావం అవుతుంది. ...న్నప్పటినుంచీకూడా మగబిడ్డల ...వున్న చిక్కు ఈమెతో వుండదు. ...జూనీళ్ళుపోసుకోమని, కాళ్ళుచే... శుభ్రంగా కడుక్కోమని, ...చు మొగంకడుక్కుని బొట్టు ...టుక పెట్టుకోమని మొగపిల్లలకు ...ప్పినంతగా ఈమెకు చెప్పనక్కర ...దు. అతిబాల్యంనుంచి ఆడపిల్ల... తమ అలంకారప్రియత్వాన్ని ...డిస్తారు. షోకుచేసుకోవడంలో ... చిన్నప్పటినుంచీ సహజమైన ...వుంటుంది. ప్రపంచానికి తన ...ణంతో పనివున్నదనే విష... ఆమె చాలచిన్నప్పుడే గ్రహిస్తుంది. అది ఈశ్వరాదేశం. ఆ ... సెక్సుప్రభావం మగవారిలో ...ంటె ఒకటి రెండు ఏండ్లు ముందు ...నే కనిపిస్తుంది. పదమూడుఏళ్ల ...పైబడిన్నీ పద్నాలుగుఏళ్లకు లో...న్నీ ఆమె పుష్పవతి అవుతుంది. ...లసరిబుతువే ఆమెకు యౌవనప్రాదుర్భావం అయిందనడానికి ...ర్తు.

పురుషుణ్ణి చూడండి. అతడు పదహారు ఏళ్ళకి నూనూగుమీసాల ...త్న యౌవనుడు. పై పెదవిమీద ...వడలమీద వెంట్రుకలు మొలవడానికి ప్రారంభిస్తాయి. కొంతకాలం ...వరకు అతడు వానిని అంతగు ర్తిం... కాని అతనిస్నేహితులు వూరుణోక నర్మగర్భంగా అతన్ని ఆక్షేపించడానికి ఆరంభిస్తారు. అప్పుడు అతడు మంగలివానిశరణు పొందుతాడు. ఆమీదట అది అతనికొక నిత్యకృత్యం అవుతుంది. బుజాలు ఎగుబుజాలుఅవుతాయి. వక్షస్థలం విశాలంఅవుతుంది. కాళ్లు పొడుగుగా సాగుతాయి. కంఠములో మాటలుపుట్టునాళము దాదాపు రెట్టింపు సైజుకు పెరుగుతుంది. కంఠస్వరంలోని గాంభీర్యం స్థాయీభావాన్ని పొందుతుంది. ఈమార్పులతో బాటే అతని వృషణములు పెద్దవై ప్రకృతిఅనుగ్రహించిన అండకోశములసంచిలో భద్రమై కాళ్లనడుమను పురుషాంగమునకు దిగువను వుంటాయి. అతడు అన్నివిధముల పురుషుడు.

ఇక యౌవనప్రాదుర్భావకాలంలో స్త్రీలో కానవచ్చేమార్పులు ఇంతకంటె ప్రస్ఫుటాలై వుంటాయి. ఆమె ఇప్పుడు మునుపటివలె తలనుంచి పాదాలవరకూఒకే సదునుగావుండే విగ్రహంకాదు. ఆ విగ్రహానికి ఏదో ఒక కొత్తపోత వస్తుంది. ఆమె స్తనాలు ఉబికి ఉదుటైవుంటాయి. ఆమెనితంబాలు విశాలంఅవుతాయి. ఆమెకంఠం శంఖస్వరూపానికి దాయాది అవుతుంది. ఆమెచేతులు, కాళ్లు స్త్రీసహజమైన వంపుల్ని, వయ్యారాల్ని అలవరచుకుంటాయి. ఆ అతిలోకసౌందర్యానికి ఆమెమొగం సమగ్రత్వాన్ని కలిగిస్తుంది, ఆమె అన్నివిధాలా స్త్రీఅయినదనే విషయాన్ని-చాటుతుంది.

స్త్రీవిషయంలో పురుషులకు వలె పైకివచ్చే వృషణాలులేవు. అండాశయాలు ఇప్పుడు ఆమెశరీరంలో పనిచేస్తూవుంటాయి. స్తనాలలో, నితంబాలలో, విగ్రహంలో వచ్చినమార్పులు ఆమెకామపురుషార్థంయొక్క ప్రయోజనాన్ని పొందడానికి సంసిద్ధురాలైవున్నదనే విషయాన్ని లోకానికి తెలియచేస్తాయి.

# మా గృహ నిర్మాణం

## -మునిమాణిక్యం నరసింహారావు

ఈ అద్దె కొంపలలో ఉండి అవస్థలు పడలేక స్వంత ఇల్లొకటి కట్టించుకోవలెనని అభిలాష పడ్డాను. 'ఇల్లుకట్టి చూడండి. పెండ్లిచేసి చూడండి' అన్నారు. ఇది లోకోక్తి. ఇల్లు కట్టి చూడండి అన్నారు గానీ ఇల్లు కడతానని కొంపలో అని చూడండీ తెలుస్తుంది! నేనన్నానేమో అనుభవించానేమో చెపుతాను ఆ సంగతి, ముందు మా శిరోమణి సంగతి చెప్పనీయండి.

ఎందుకంటే ఇల్లు కట్టడం అంటూ వస్తే శిరోమణి ప్రశంస తేకుండా ఉండ టానికి వీల్లేదు. పాండవారణ్య వాస కథ చెప్పడానికి నలోపాఖ్యానం ఎట్లా అవసర మయిందో, అలాగే నా గృహ నిర్మాణ ప్రయత్నానికి ముందు మా శిరోమణి సంగతి చెప్పటం అవసరం అయింది.

మా శిరోమణికి ఒకసారి... ఇల్లు కట్టాలని బుద్ధి పుట్టింది. అతని వద్ద చేతిలో నాలుగు వందల రూపా యలూ ఉన్నాయి. గుంటూరులో వెయ్యి గజాల నివేశన స్థలమూ ఉంది. ఆ స్థలంలో ఒక చక్కని గృహ నిర్మాణం చేయాలని అతనికి ఒక పెద్ద ఊహ కలిగింది. నాలుగు వందలు పెడితే ఏదో ఒకరకం కొంప ఒకటి కట్టటం అంత అసాధ్యమైన పని కాదు. కాని అతని ఉద్దేశం ఆ తక్కువ మొత్తంతోనే అన్ని సౌకర్యాలు కమాండు చేసే ఇల్లు కట్టాలని.



గృహ నిర్మాణాన్ని గురించి కొన్ని పుస్తకాలు చది వితే తాను చౌకగా ఇల్లు కట్టడమే కాకుండా అఖిలాంధ్ర వనికి కూడా ఒక నిరాడంబరమైన ఆదర్శాన్ని కల్పించ వచ్చునని తోచింది.

''వెధవలు, మన ఆంధ్రులకు బుద్ధి లేదు. వేలకు వేలు పోసి లంకంత లోగిళ్ళు కడతారు. దరిద్రపు కొంపలు గొడ్ల సావిళ్ళలాగా తయారు అవుతాయి. గాలి వచ్చే మార్గమూ ఉండదు. పడకగదీ అంటూ అసలు ఉండదు. చచ్చేటంత మందంగా గోడలూ, దయ్యాలలాంటి సావిళ్ళూనూ. ఎందుకూ పనికి రాకుండా కడతారు. ఇంకో పద్ధతిలో కట్టడమూ తెలియదు.'' అని అంటూ ఉపన్యాసం సాగించాడు శిరోమణి ఆ రోజు నుంచీ.

ఇక గృహ నిర్మాణాన్ని గురించి చదవాలె. తదర్థం 'హిగింబాదమ్స్' నుండి కాటలాగు ఒకటి ముందు తెప్పించాడు. ఇల్లు కట్టడానికై నిలువ ఉంచుకున్న నాలుగు వందలలో నుంచీ పుస్తకాల కోసం డబ్బు ఖర్చు పెట్టడం తెలివితక్కువ పని అని అతనికి తెలియకపోలేదు. అందుకని ఇరవై రూపాయలు మాత్రం వ్యయం చేసి నికరమైన జ్ఞానాన్ని ఇచ్చే పుస్తకాలు కొన్ని మాత్రం తెప్పించాడు.

అవి క్షుణ్ణంగా చదివాడు. జపాను వారి గృహ నిర్మాణ పద్ధతీ, ఇంగ్లండులో కంట్రీ హౌస్ నిర్మాణమూ, జర్మనీలో పద్ధతీ, నీగ్రోలు, ఎస్కిమోలు మొదలగు వారు ఇండ్లు కట్టే పద్ధతీ వారి నేర్పరితనమూ, మొదలైన విచిత్ర విషయాలు ఎన్నో మాకు ఆయన చెపుతూ ఉంటే మేము ఆశ్చర్యంతో చెవులు నిక్కపొడుచుకొని వింటూ ఉండేవాళ్ళం.

తరుపరి దొంగలకు అలవికాని ఇళ్ళు కట్టే పద్ధతిని గురించి చెపుతూ ఉండేవాడు. ఒకదాని ప్రక్కన ఒకటి ఒకటిన్నర అడుగుల ఎడంలో, రెండు గోడలు ఒక ఇటుక వరస మందాన లేపి ఆ రెండు గోడల మధ్య ఇసుక పోస్తే, ఇక దొంగ అక్కడ కన్నం వేయటానికి వీలు లేదు. అతి చౌకలో దొంగలకు అలవిగాని ఇల్లు కట్టే పద్ధతి. ఇది ఇల్లాగ నాలుగు గోడలూ కట్టిన గదిలో బంగారం పారేసు కున్నా దొంగలకు అందదు అని అంటూ ఉండే వాడు. ఆయన చెప్పే పద్ధతులు విన్నప్పుడు మట్టుకు అటువంటి ఇల్లొకటి కట్టి బంగారం పారేస్తే బాగుండునూ అనిపిస్తూండేది. గృహ నిర్మాణ విషయమై ఆయన చూపిస్తున్న జ్ఞాన సంపత్తును గూర్చి మేము 'ఊహూ' గర్వపడుతూ ఉండేవాళ్ళం.

వూళ్ళో ఎక్కడున్నా పునాదులు తీస్తునట్టు కనపడిందా అక్కడికి మేము తయారు. వెళ్ళి ఆ యజమానిని ఎంత కష్టపడి అయినా సరే కలుసుకుని, ''అయ్యా మీరు ఏదో ఇల్లు కట్టే ప్రయత్నంలో ఉన్నట్టున్నారు. శిరోమణి గారిని కలుసుకొని ప్రసంగించారా'' అనటం, అతడు మేము భయపడ్డట్టుగానే 'లేదండీ' అనే వాడు. 'అయ్యయ్యో, మీరు ఆయనతో సంప్రతించకుండా ఏ ప్రయత్నమూ చెయ్యకండీ, గృహ నిర్మాణ విషయంలో ఆయన నిధి'... అట్లాగ అని చెప్పే వాళ్ళం. ఆయన మర్నాడు శిరోమణి వద్దకు వచ్చాడా సరేసరి (మేము అంతగా చెప్పినా తెలివి తక్కువ వెధవలు వచ్చేవాళ్ళుకారు) లేకపోతే శిరోమణినే అక్కడికి పట్టుకెళ్ళి ఆయనెదుట నుంచోబెట్టి, ఉపన్యాసం ఇప్పించేవాళ్ళం. అయితే వాళ్ళు తెల్ల పోయి వినేవాళ్ళు.

ఇట్లా, మనిషైనవాడు ఎందుకు కడుతూ ఉన్నాడు తనకూ, తన కుటుం బానికీ, నీడ కోసమున్నూ, తన ఆస్తిని దొంగలు ఎత్తుకొని పోకుండా రక్షించు కోవటానికినీ... అందులో ఆస్తి రక్షణే ముఖ్యమైనది కాబట్టి దొంగలూ, వాళ్ళూ ఇండ్లల్లో ప్రవేశించడానికి అవలంబించే మార్గాలూ, వాళ్ళ పద్ధతులూ, రకరకాల దొంగతనాలూ ఇవన్నీ చదివితే కాని, ఆ పద్ధతులు అన్నింటికీ అలవికాని గృహ నిర్మాణం ఇదమిత్థం అని నిర్ణయించటానికి వీలు లేదు. అందుచేత మనవాడు ఒక సంవత్సరం పాటు తత్ సంబంధమైన వాఙ్మయం అంతా గాలించి క్షుణ్ణంగా చదివాడు. అగ్ని భయమూ, చోరభయమూ మొదలైనవి ఏమీ లేకుండా చౌకలో ఇల్లు కట్టే పద్ధతి ఇప్పుడతనికి తెలిసింది.

ఇల్లు కట్టే పద్ధతి తెలిసేటప్పటికి డబ్బు చాలా భాగం అయిపోయింది. రెండు వందలు కాబోలు అప్పటికి ఉన్నాయి. ఆ రెండు వందలతో ఇల్లు కట్టడానికి చాలేటట్టు లేదు.

అయితే ఆ ఉన్న మొత్తానికి ఇంకో రెండు వందలు అప్పుజేసి కలిపి, ఇల్లు కడితే ఆ అప్పు ఆ ఇల్లే తీర్చుకోదా అనీ, తాను ఇన్నాళ్ళూ చదివి చదివి సంపా

దించిన జ్ఞానం వల్ల మూడు వందల లోనే ఇల్లు కట్టలేనా అనీ అతనికి తోచింది. కాని ఇప్పుడు ఆ కాస్తా, ఇల్లు కట్టడానికి వినియోగిస్తే, ఇక తనకు జన్మలో ఆ శాస్త్రంలో పరిపూర్ణమైన జ్ఞానము సంపాదించటానికి అవకాశం ఉండదన్న మాట నిశ్చయం, అందుచేతా...

ఇంకా పుస్తకాలు కొని ఆ జ్ఞానాన్ని పూర్తిగా సంపాదించుకోవాలెననీ, ఇల్లు సంగతి దర్మిలా ఆలోచించుకోవచ్చుననీ అతనికి తోచింది. అందుకని పుస్తకాలు కొని ఇంకా జ్ఞానాభివృద్ధి చేసుకున్నాడు.

ఆ నెలలోనే 'గృహ నిర్మాణము దాని చరిత్రము' అని ఒక చక్కని వ్యాసం వ్రాశాడు. అందులో సృష్ట్యాదిలో మానవుడు గుహలలో నివసించిన దగ్గర నుంచీ మొదలుపెట్టి, ఏదో ఒక ఆచ్ఛాదన కోసం మానవ హృదయం ఎట్లా పరితాపం పొందిందీ చూసి గృహ నిర్మాణాభిముఖంగా మానవ ప్రయత్నాలు, ఏయే దేశాలలో, దేశ పరిస్థితుల ననుసరించి, ఏయే విధంగా పరిణామం పొందినవో చూసి, వర్తమాన కాలంలో గృహ నిర్మాణం ఎట్టి మహత్తరమైన సృష్టివైచిత్ర్యంగా తయారైందో అగుపర్చాడు.

ఆ వ్యాసాన్ని మెచ్చుకోని వారు లేరు. చారిత్రక పరిశోధన మండలి వారు కూడా శిరోమణిని అభినందించారు.

ద్రవ్య లాభం మట్టుకు ఏమీ కలుగలేదు...

అక్కడ నుంచి అతడు వివిధ పత్రికలకు ఈ విషయమై వ్యాసాలు పంపడం సాగించాడు. గ్రంథావలోకనం ఎక్కువైంది. గృహ నిర్మాణం విషయమై దొరికిన పుస్తకమల్లా చదివాడు.

గుంటూరులో ఉన్న వెయ్యి గజాల నివేశన స్థలం ఇక అతనికి అనవసరం అనిపించింది.

అదీగాక గుంటూరు అతనికి ఇరుకైపోయింది. అంటే అతని విశాల దృష్టిలో గుంటూరు చాలా చిన్న ఊరు అయింది. ఆ స్థలం అమ్మివేస్తే, ఉన్న అప్పులూ తీర్చుకోవచ్చు. రెండు మూడు వందలు చేతపట్టుకొని మద్రాసు వెళ్ళవచ్చునని తోచింది.

కొద్ది రోజులకే మద్రాసు చేరాడు.

మద్రాసు వెళ్లిన తరువాత... 'మూడు వందలలో ముచ్చట అయిన యిల్లు.' అనే వ్యాసం వ్రాశారు. మూడు గదులూ, ఒక వంట ఇంటితో సహా, మూడు వందలతో ఒక ఇల్లు కట్టడం ఎల్లాగ సాధ్యమో చూపిస్తూ దానికి కావలసిన వస్తువులూ, వాని ధరలూ, ఆ లెక్కలూ, ఆ ప్లానులూ, సమస్తమూ తయారు చేసి వ్రాసి చూపాడు. దానితో అతనికి అద్భుతమైన పేరు వచ్చింది. గవర్నమెంటు వారు శిరోమణిని వెంటనే ఆర్కిటెక్టుగా నియమించకపోవడం కేవలం అన్యాయం అనిపించింది. అతనిని అందరూ వేనోళ్ళ పొగిడారు.

అక్కడ నుంచి అతనికి ఒకటే పిచ్చి. పుస్తకాలు కొనటం, చదవటం ఇప్పటి కాల పరిస్థితులనూ దారిద్ర్యాన్ని పట్టి ఇల్లు చౌకలో ఎట్లాగూ కట్టవచ్చునో, గవర్నమెంటు వారు తాము కట్టే భవనాలలో కొద్ది మార్పులు చేస్తే ఎన్ని లక్షలు ఆదా చెయ్యవచ్చునో మొదలైన విషయాలు ఎన్నో అతడు బయటపెడుతూంటే ఆంధ్రావని అట్టుడికినట్టు ఉడికిపోయింది. ఇట్టి విషయమై జ్ఞానంలో శిరోమణి నిధి అయిపోయినాడు. కీర్తి వచ్చింది కానీ... ఆర్థికంగా మట్టుకు అతనికేమీ లాభించలేదు!! లాభించలేదని అతడు నిరుత్సాహమూ చెందలేదు. గృహ నిర్మాణంలో నుంచి, అతడు గృహ సౌందర్య విషయమై... 'ది ఈస్తటిక్స్ ఆఫ్ ది హోమ్' తెలుసుకోవడం మొదలుపెట్టాడు. అదో ఏడాది తీవ్రంగా చదివాడు. తరువాత పశ్చిమ దేశాలలో గృహ నిర్మాణమూ, ప్రాగ్దేశాలలో గృహ నిర్మాణమూ ఈ రెంటికి గల సామరస్యమూ భేదమూ అంటూ మరొక వ్యాసం వ్రాశాడు.

గృహ నిర్మాణాన్ని గురించి చదువుతూ ఉన్న రోజులలోనే ఆయనకు వాస్తు శాస్త్రంతో పరిచయం కలగటం సంభవించింది. అది క్షుణ్ణంగా చదివిన మీదట ఆయన మనస్సు జ్యోతిషం మీదికి పోయింది. ఇక అప్పటి నుండీ ఆయన జ్యోతిషం మీద పట్టించాడు.

ఇంతకూ, ఆయన అప్పటికీ ఇప్పటికీ ఇల్లు కట్టలేదు. కాని ఇల్లు కట్టడాన్ని గురించీ, ఆ శాస్త్రానికీ సన్నిహితమైన వాస్తు జ్యోతిశ్శాస్త్రాలను గురించీ శిరోమణికి తెలిసినంతగా ఇంక ఎవ్వరికీ తెలియదు.

ఇంతకూ ఎందుకు చెప్పానంటే ఇదంతా... అదిగో ఆ చివర వాక్యం ఉందే, అప్పటికీ ఇప్పటికీ... అని అదే ఆ వాక్యమే మా ఇద్దరి జీవితాలను కలిపి కుట్టింది ... అదే మా జీవిత పథాలను కలుపుతూ ఉన్న అడ్డ రోడ్డు. అదే మా జీవిత స్రవంతులను కలుపు వారా వధి. మా జీవిత సంగీతానికి మేళ కర్త. అదే ఆహత నాదం. మా జీవిత విపంచులు ఆ వాక్యం స్ఫురించే అర్థంలో మాత్రం ఏకశ్రుతిని పొందినవి. ఒకే శ్రుతిలో ఉన్న వీణాతంత్రులలో ఒక దానిని కదిలిస్తే రెండో తీగలో కూడా అదే విధంగా కదలిక కలిగినట్లు అతని జీవిత విపంచిపై జన్మించిన నాదమే నా జీవిత విపంచిపై కూడా సంవాది న్యాయానుగుణ్యంగా మ్రోగింది. ఆ వాక్యార్థం యొక్క అనుభూతియే మా యిరువురి జీవితాలలోను రసోద్దీపకమైన ఘట్టము. ఆ వాక్య స్ఫురణలో ఉత్పత్తి అయిన నాదాలే మా ఇరువురి జీవితాలలో ఆరోహణా క్రమణ ఊర్ధ్వముఖంగా బయలుదేరి మూలాధార స్వాధిష్ఠాన, మణిపూరక అనాహతాది చక్రపరంపరను దాటి తారస్థాయిలో మేళవించినై. అందుచేతనే ఆ కథ అంతా చెప్పవలసి వచ్చింది.

***

ఇక నా సంగతి.

నేనూ ఇల్లు కడదామని తీవ్రంగా ఆలోచించాను. ప్లానులు కూడా తయారు చేశాను. ఇంటికి ముందు వసారా, దక్షిణాన పడకగదీ, పడమట వంట ఇల్లూ, మధ్య హాలూ ఉండేటట్టు ఏర్పాటు చేశాను. మా అమ్మాయి 'నాకో గది ప్రత్యేకంగా కావాలెనాన్నా' అన్నది ఇదంతా గ్రహించి.

''నీకు గది ఎందుకే. రేపో ఎల్లుండో అత్తవారింటికి పోయేదానివి... దాని

### ఆంధ్ర కేసరి

ఒకసారి విశ్వనాథ సత్యనారాయణగారికి రాష్ట్ర సచివాలయంలో ఏదో పని కావలసి వచ్చింది. చాలా రోజులుగా ఆ వ్యవహారం తెమలకపోవడంతో ఏదో సందర్భంలో టంగుటూరి ప్రకాశం పంతులు గారిని కలిసినప్పుడు ఆ విషయం ప్రస్తావించారు. సచివాలయంలో వారికి కావలసిన పని ఎంతవరకు వచ్చిందో తెలుసుకోమని ప్రకాశం గారిని అడిగారు. అందుకు ప్రకాశం గారు కొంత విముఖత చూపుతూ- ''ఆ సచివాలయం పెద్ద అడివి. దానిలో పనులు అలాగే వుంటాయి'' అన్నారు.

అందుకు విశ్వనాథ ఓ చిరునవ్వు నవ్వి ''అందుకే కదండీ తమకు మనవి చేసుకున్నది. మీరు ఆంధ్రకేసరి కదా! ఆ అడవి మీకొక లెక్క కాదు'' అన్నారు.

ఆ మాట విన్నాక ఆంధ్రకేసరికి ఆ పని నెత్తిన వేసుకోక తప్పింది కాదు.



## అగ్రస్థానం సమయస్ఫూర్తి

ఒకసారి అనకాపల్లిలో కృష్ణతులాభారం నాటకం ప్రదర్శిస్తున్నారు. స్థానం నరసింహారావు సత్యభామగానూ, కె. గోవిందరావు రుక్మిణిగానూ నటిస్తున్నారు. చివరి రంగంలో కృష్ణుణ్ణి రుక్మిణి వచ్చి తులసి దళాలతో తూస్తుంది. రుక్మిణి తులసిదళం పుచ్చుకుని భక్తిభావంతో ''ఫలమో, ఘనరసంబో, పత్రమో, పుష్పమో,

గొనుచు భక్తి నిన్ను గొలుచు వారి కీవు
వశుడగుటయే సత్యమేని,
ఈ తులసిదళము నిన్ను తూచుగాక''

అని పద్యం చదువుతూ త్రాసులో వుంచింది. కాని సాంకేతిక లోపం వల్ల అనుకున్న ప్రకారం కృష్ణుడు కూర్చున్న సిబ్బె పైకి లేవలేదు. స్టేజి మీదున్న వారందరికీ నిలువు గుడ్లు పడ్డాయి. జనం గొల్లుమన్నారు. అప్పుడు స్థానం వారు ''అక్కా! భర్తకు యిలాంటి స్థితి పట్టినది గదా అన్న ఆవేదనలో నీ ధ్యానము నిలకడ తప్పినట్టుంది. మరల మనస్సుని లగ్నము చేసుకుని తులసి దళము వుంచుము'' అన్నారు.

రుక్మిణి మరల ''ఫలమో, ఘనరసంబో''... అంటూ మరల దళం వుంచింది. కాని ఈసారి పద్యం పూర్తి కాక ముందే కృష్ణుడు పైకి లేచాడు. జనంలోంచి మళ్ళీ నవ్వులు! ''అక్కా! నీ భక్తి మధ్యలోనే పరాకాష్ఠ నందుకున్నది చూచితివా'' అని రెండవసారి స్థానం వారు సమర్థించి ప్రేక్షకుల నోటికి తాళం వేశారు.

కెందుకు నాన్నా నా మట్టుకు చదువుకొనేందుకు ప్రత్యేకంగా గది కావలెనాన్నా'' అన్నాడు మా అబ్బాయి.

''నీవు మట్టుకు ఇక్కడ ఉండవచ్చావా ఏమిటి పెద్దఅయిం తరవాత ఏ వూళ్ళో ఉద్యోగం అవుతుందో ఎక్కడ వుంటావో నీకు మట్టుకు గది ఎందుకురా'' అన్నది ఆడపిల్ల.

''నాకు కావాలె ... అదంతా నీకెందుకూ'' అని మొగపిల్లవాడు ఉరిమి చూశాడు.

''నీకు ... అనవసరం ... అంతవరకు నిజం, నాకంటే ... బట్టలూ, సొమ్ములూ ఉంటాయి కాబట్టి ప్రత్యేకం గది కావలె'' అన్నది. అది సహేతుకంగా మాట్లాడాలని ప్రయత్నిస్తున్నట్టు.

''నీకున్న- పెట్టెకూ, సొమ్ములకూనూ ఓ పెద్ద గది కూడానూ! వెధవది రెండు పెట్టెలున్నాయో లేవో!!'' అన్నాడు వీడు రొమ్ము విరుస్తూ.

''నీకు ఏడ్సినైలే...'' అన్నది.

''నీకు ఏడ్సినై మాటలు సరిగ్గా రానీ'' అన్నాడు- వీడు ముక్కుపుటాలు ఎగరేస్తూ.

''వెధవగది నీవే తీసుకో- నాకొద్దులే''- అని కళ్ళ నీళ్ళు గుక్కుకుంది ఆడపిల్ల.

''ఆ వెధవ గది అంటావా'' అని లేచాడు, కోపంతో, నాకు వళ్ళు మండిపోయింది, వీళ్ళ పోట్లాట చూస్తే.

''నోరు మూయండ్రా భడవల్లారా, ఆలూ లేదూ సూలూ లేదూ కొడుకు పేరు సోమలింగమన్నట్లుంది. ఇల్లు కట్టనూ లేదు, పెట్టనూ లేదూ, మీరు గదుల కోసం పోట్లాటా!!'' అని వాళ్ళ ఇద్దరినీ సర్ది పడుకోండి అని పంపించి ప్లానులు ముందేసుకొని, దక్షిణపు వేపు గోడకు రెండు కిటికీలు పెడితే బాగుంటుందా లేక దక్షిణాన ఒకటే పెడదామా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. సింహద్వారం మట్టుకు తూర్పుకే పెట్టడానికి నిశ్చయించాను. అయితే దక్షిణవేపు గదే పడకగది కావాలె. ఆ గదిలో ఎనిమిది మంచాలూ పట్టాలె. ఎట్లాగా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

ఇంతలోకే తొమ్మిది గంటలూ, ఠాంగ్, ఠాంగ్న కొట్టడం ఏమిటి, మా ఆవిడ ఘల్లు ఘల్లున గుండు చెంబుతో మంచినీళ్ళు పట్టుకుని రావటం ఏమిటీ, రెండూ ఒకసారే.

చిరునవ్వుతో మా కాంతాన్ని ఆహ్వానించాను.

''ఏం మహా సరదాగా ఉన్నారు ఇవ్వాళ'' అన్నది కనుబొమ్మలెగరేస్తూ.

''రా. రా. ఇట్లా కూర్చో చెప్తాను గాదూ నీకు, ఇల్లు కట్టించాలని ప్రయత్నం చేస్తున్నానని. అదీ సంగతి. ప్లానులు అన్నీ తయారు అయినై. దక్షిణపు వైపున మన పడకగదికి రెండు కిటికీలుంటాయి. కావలసినంత గాలి. చూడు. ఇక్కడా... ఇల్లు ఇలాగ తూర్పు ముఖంగా ఉంటుంది- పడకగదికి అవతల చిన్న తోట. అందులో గులాబి, చామంతి, మల్లె, జాజి, గన్నేరు, రేరాణి మొదలైన పూల మొక్కలుంటాయి. ఆ పూలపై నుంచి వచ్చే మంచి గాలి సరిగ్గా మన గదిలోకి వస్తుంది. రెండే గదులు అందులో ఇది నేను చదువుకొనే గది. నా కుర్చీలు, బల్లా, బీరువా ఇక్కడే పెట్టుకుంటాను. ఏం అట్లా చూస్తావేం. అర్థం అవుతున్నదా

''ఇట్లా కాగితం మీద చూస్తే నాకు అర్థం గాదు ఇంతకూ స్థలం ఎక్కడ కొన్నారూ''

''ఇంకా కొనలేదు. ఎంతలోకి కొనాలె!''

'పోనీ డబ్బు అయినా సిద్ధంగా ఉందా' అంది మూతి విరుస్తూ, ఒక కన్ను మూసి ఒక కన్ను తెరచి.

'ఈ వెధవ ప్రశ్నలు వేస్తావని నాకు తెలుసు. అందుకనే నీకు ఇన్నాళ్ళ బట్టీ చెప్పలేదు.'

''అయితే ఇది వెధవ ప్రశ్నా డబ్బు లేకుండా ఇల్లు ఎట్లాగ కడతారండీ'' అన్నది ఆ మాత్రం నాకు తెలియదన్నట్లు చూస్తూ.

''డబ్బు కావాలే అనుకో'' అన్నాను నేను దర్జాగా...

''అనుకోవటం ఏమిటి కావాలె- ఉందా'' అంది ఆవిడ వర్తకుడిలాగా కఠినంగా.

'ఉందా అంటే మరీ... రొక్కంగా లేదనుకో... కానీ కానీ...' అంటూ కళ్ళు తేలేస్తూ అట్లాగే కుర్చీలో కూర్చున్నాను, కలంపుల్ల పళ్ళ సందున బిగించి కొరుకుతూ.

'రొక్కంగా గాక, నోట్ల రూపంగానా' అన్నది కాంతం వెటకారంగా నవ్వుతూ.

'అవునూ... నోట్లే... అంటే ప్రామీసరీ నోట్ల మూలకంగా' అన్నాను. హఠాత్తుగా ఏదో విధమైన సమాధానం చెప్పగలిగానన్న సంతోషంతో. నిజానికి మొదట నేను ఇటువంటి అసందర్భపు ప్రశ్నలు ఈవిడ వేస్తుందనుకోలేదు. ఏదో నాలాగే అందరి మోస్తరుగా సంతోషిస్తుంది అనుకున్నాను గాని.

ప్రామిసరీ నోటు అనే మాట వినేసరికి ముఖం ఇంత జేసుకొని... 'అప్పు

జేసి ఇల్లు కడతారూ' అన్నది. ఈ మాటలు ఎట్లాగా అన్నదో కాని నన్ను సాగదీసి లెంపకాయ కొట్టినా, అంత బాధ పెట్టేది కాదు. ఆ మాటలు అంతకంటే బాధ పెట్టినయి.

'అప్పంటే... అప్పు గాదు. నీకెందుకూ నీవూరుకో' అన్నాను విసుగ్గా ఏమీ తోచక.

'అప్పుగాకపోవటం ఏమిటి' అన్నది కనుబొమ్మలు ముడిచి.

'అప్పుకాక పోవటం ఏమిటంతే... బ్యాంకులో తెస్తాను' అన్నాను జయ సూచకంగా నవ్వుతూ...

బ్యాంకులో తెస్తే అప్పు కాదా అని అడుగుతుందని నాకు తెలుసూ. అడగనూ అడిగింది.

'అప్పేననుకో, అయితే మట్టుకు అది వేరు. ఆ కట్టిన ఇల్లు అద్దెకు ఇస్తే నాలుగేండ్లలో దాని అప్పు అదే తీర్చుకుంటుంది.' అన్నాను నేను. నిజానికి కూడా నా ఊహ అదే.

ఈ ఊహ ఆవిడకు నచ్చలేదు. మనం అద్దె కొంపలో నానా అవస్థ పడుతూ, కొత్తగా కట్టిన ఇల్లు అద్దె కివ్వటమా మహబాగుంది మీ ప్లాను' అని నీరసంగా మాట్లాడింది.

ఆడదానితో కాస్త రాజీకి వస్తే మంచిది. అందుకని 'పోనీ నీ మాట ఎందుకు కొట్టెయ్యాలె. మనమే ఆ ఇంట్లో ఉండి, అద్దె ఇస్తున్నట్లుగానే నెలకు పది రూపాయలు ఇస్తూ అప్పు తీరుద్దాం' అన్నాను. కొంచెం దారికి వస్తున్నదీ అన్న సంతోషం కూడా కలిగింది.

'అయ్యో!! అయ్యో!! మీరే అప్పు తీర్చేది! ఇల్లు మీరు కట్టనూ. నేను ..పురం ఉండనూనా!' అన్నది రాగాలు తీస్తూ.

'నేను కట్టలేనా' అన్నాను మూతి బిగించి.

'కట్టాలె!' అన్నది ఆవిడ చెయ్యి చాచి నేలవైపు పతాక హస్తాన్ని చూపుతూ.

'ఏం, అట్లా అంటావు! నేనేం కట్టలేనా' అని అన్నాను మీసం మెలేస్తూ.

ఇక అందుకుంది ఒక ఉపన్యాసానికి 'కట్టలేకేం! పెద్ద పిల్ల పెండ్లికి అయిన అప్పు.. ఇంతవరకూ.. దమ్మిడి తీరలేదూ.. ఏదో కరతారట.. కరటం' అంటూ మళ్ళీ అరిచేతులు అదోముఖంగా చూపటం విదిలించటం సాగించింది.

***

నాకు వళ్ళు మండింది.

'ఏం, అంత నిరసనగా మాట్లాడుతున్నావు నాకంటె ఎక్కువ సంపాదిస్తున్నారా మీ వాళ్ళు మీ నాన్న ఎక్కువ వాడా మీ తమ్ముడు నాకంటే పొడిచేవాడా అందరి ప్రయోజకత్వం తెలుసు!' అన్నాను నేను తల పంకిస్తూ చేతులు పూపుతూ.

'మా నాన్నకేం ఆయన రెండు ఇండ్లు కట్టించాడు. ఆయనను ఎక్కిరించ వచ్చారూ' అన్నది ఆవిడ. వాళ్ళ నాన్న గొప్ప గొప్ప సాహసకృత్యాలన్నీ చేసినట్లూ, అవి నేను కృతజ్ఞతతో జ్ఞాపకం ఉంచుకోక మహాపరాధం చేసినట్లూ. చూపులతో చెపుతూ,

'అవును, ఏం లాభం, ఆ రెండు ఇళ్ళూ అమ్మాడు మళ్ళీనీ.. నీవైతే పొరుగిల్లు కూడా అమ్మేవాడు. చెప్పొచ్చావు ఆయన ప్రయోజకత్వం' అన్నాను నేను ముక్కుతూ.

'మీరు అమ్మరాదూ చల్లపల్లి వారి కెకినీ మహల్'

'ఇక చాలించు'

'మరి మా వాళ్ళ మాట ఎత్తకండి'

## కట్టమంచి చమత్కారాలు

కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా చాలా కాలం పనిచేశారు. ఆయన ఆజన్మ బ్రహ్మచారి. ఆంధ్ర విశ్వవిద్యాలయమే తమ ప్రేయసి అని చెప్పుకునేవారు. ఒక సభలో ఆయనను భీష్ముడు, హనుమంతుడు అంటూ కొందరు వక్తలు ప్రస్తుతించడం ప్రారంభించారు. తర్వాత రెడ్డిగారు అందుకుని ''లేనిపోని ఉపమానాలను, విశేషకాలను ఎందుకు దుర్వినియోగం చేస్తారు అవివాహితుడు అంటే సరిపోతుంది'' చమత్కరించారు.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారిని ఆస్థాన కవిగా నియమించిన సందర్భాన్ని పురస్కరించుకుని విజయవాడలో సభ జరిగింది. ఆనాటి సన్మాన సభకు రామలింగారెడ్డిగారు అధ్యక్షత వహిం చారు. రెడ్డిగారు అధ్యక్షోపన్యాసం చేస్తుంటే వెనుక నుంచి ఆపహాస్యంగా శాస్త్రిగారు ఏదో మాట్లాడడం ప్రారంభించారు. రెడ్డిగారికి చెళ్ళపెళ్ళవారంటే చెప్పలేనంత భక్తి గౌరవాలుండేవి. అయితే ఆయన అలా మాట్లాడడం అటు శ్రోతలకు, ఇటు రెడ్డిగారికి కూడా చాలా అసౌకర్యంగా వుంది. శాస్త్రిగారిని ఏమీ అనలేక సి.ఆర్.రెడ్డిగారు తన సహజ చమత్కార ధోరణితో- ''మా గురువు గారికి మొదటి నుంచి అంట కవిత్వం అలవాటు మరి. ప్రసంగాలలో కూడా అదే అలవాటు కొనసాగుతోంది.''



'మరి నేను ఇల్లు కట్టలేననబోకు'

'కట్టలేని స్థితిలో ఉన్నారు కాబట్టి కట్టలేరు అన్నాను తప్పా!'

'కట్టగలిగిన స్థితిలో మీ తమ్ముడు ఉన్నాడా'

'మళ్ళీ వాడి మాట ఎందుకూ'

'నా మాట ఎందుకూ'

'మా మాట నాకు కావాలె'

'వాడి మాట నాకు కావాలె'

'మొండి వాదన, తలాలేదు, తోకా లేదూ!'

'మొండి వాదన నాదా నీదా'

'మొండి వాదన కాక ఏమిటండీ ఇదీ చేతిలో దమ్మిడీ లేదాయె. ఊళ్ళో మూడు నాలుగు వందల అప్పులాయె. మరి మీ మాటలు చూస్తుంటే కోటలు దాటుతూ ఉండె! అదేమంటే... కోపాలు తాపాలూ! వెనకటికి ఒకడూ... ఎందుకు లెండి. మీకు సరసం తెలియదు. మాట్లాడితే మూతి విరుపులూ, ముక్కు విరుపులూనూ.'

'అదేమిటి అల్లా అయితే ఎందుకు మొదలు పెట్టావూ సరసమో విరసమో అనేసెయ్యి, అనదల్చుకున్నది.'

'కోపమేమో'

'చెప్పకపోతే మట్టుకు కోపం గాదా'

'మరేమి లేదు లెండి. వెనుకటికి మీ మోస్తరాయనే ఒకాయన... ...'

'ఆహా- ఏమిటా విరగబడి నవ్వటం... చెప్పి మరీ నవ్వు'

'ఒకాయన అన్నాట్టా... తమల పాకులూ ఇన్ని ఏ వేధనైనా ఇస్తే బాగుండూ వక్కలకు ఏం భాగ్యం ఎవర్ని అడిగినా, రెండు ఇస్తారు. సున్నం గోడకు గిల్లి రాచుకోవచ్చా అనీ'

'అంటే నేనంత లేని స్థితిలో ఉన్నానా'

'మరి ఏముంది చెప్పండి ఇల్లు కట్టడానికి...'

'ఏమి లేని వాడకి అప్పు ఎల్లాగ పుడుతుందీ! పోనీ అప్పు పుట్టించే శక్తి అయినా ఉంది అంటావా!' అన్నాను నేను కనుబొమ్మలెగరేస్తూ.

'మన నిజస్థితి తెలిస్తే అది పుట్టదు' అన్నది ఆవిడ ఇక ఆ జవాబుకు తిరుగు లేనట్టు -

'మీ వాడికి ఇస్తున్నారు కాబోలు వేలకు వేలూ!!' అన్నాను.

'మా తమ్ముడికి ఒకరి దగ్గరకు వెళ్ళవలసిన అవసరం లేదు. వాడికేం కర్మం. మహారాజు బిడ్డ' అంది ఆవిడ గర్వంగా.

ఇట్లా మా ఆవిడ అసందర్భపు ప్రశ్నలన్నీ వేసినా ఆర్థిక పరిస్థితిని గూర్చి నిరసనగా మాట్లాడటం చూస్తే నాకు ఎట్లాగుందీ! నాద ప్రపంచంలో యమ ముఖోద్భవములైన రెండు శ్రుతులతో తుది శ్రుతి క్షోభిణి యందు విషాద స్వరముతో ఐక్యం పొందుతున్నట్లుంది. అంటే వళ్ళు మండిపోతున్నదన్నమాట. అందుకని చివరకు విసుగుతో 'అయితే నేనేనా దరిద్రుడ్ని, మీ తమ్ముడు మహారాజు బిడ్డ అయితే!' అని అన్నాను.

'నేను అన్నానా ఏమిటి అన్నీ మీరే అనుకొంటున్నారు' అన్నది ఆవిడ జవాబుగా.

'అనకపోతే మట్టుకూ, ఏమిటీ మాటలూ!! శుభమా అంటూ ఇల్లు కట్టుకొందామనుకొంటూ ఉంటే.' అన్నాను ముఖం చిట్లించి కోపంగా.

కోపం వచ్చిందని గ్రహించింది కాంతం... గ్రహించి... తగ్గింది. తగ్గి-

''కట్టండి మీకోదణ్ణం. సరేనా కట్టండి ఇల్లూ, అప్పుజేయండి!''

''అప్పుజేసే కడతానో, ఆదా చేసి కడతానో! అయినా మగవాళ్ళు ఏం చేస్తారో నీకెందుకూ! ప్రతిదీని నాకు కావాలని వస్తావూ. ఇక ఊరుకో'' అన్నాను కోపంగా.

''నేను ఏమన్నా అంటే ఒట్టు. రేపే కట్టండి.'' అన్నది రేపే అన్న మాట నొక్కి నొక్కి అంటూ.

''కడతాను చూస్తుండు. రేపే కడతానో లేకపోతే ఇంకా నాలుగేండ్లకే కడతానో తీరిగ్గా.'' అన్నాను నిర్లక్ష్యంగా నీ లెక్కేమిటి అన్నట్లు.

''మీ ఇష్టం అంటినిగా.. ఇక నన్ను వాగించకండి. పెద్ద పోట్లాట అవుతుంది. ఇంతటితో పోనీయండి రికామిగా'' అన్నది. మాటలో ప్రతి అక్షరాన్ని సాగదీస్తూ.

నేనూ ప్రతి అక్షరాన్ని సాగదీస్తూనే జవాబు చెప్పాను. ''సకామీగానే... కడతాను, నీ సలహా ఏమిటి... నాకు నీ మాటలు వింటూంటే మంటెత్తుతుంది. మనిషియందూ... ఒక్క పిసరు అన్నా... గౌరవం లేదాయె... యెంత చెప్పినా మనిషియందు నమ్మకం లేదాయె! ఇంతకూ నీకు స్వంత ఇల్లు ఉండే ప్రాప్తి ఉన్నట్లు లేదు. నేనేం చేసేది:- ఊహు- అటు తిరుగు.''

# లోకాభి రామాయణం

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

ప్రత్యేకంగా ఏదో ఒక విషయాన్ని గురించి కాక అనేక సంగతులను గురించి మాట్లాడడాన్ని లోకాభి రామాయణం అంటారు. అసలు ఆ మాటకు, లోకమునకు మనోహరమైన మార్గమున సంభాషణ నడుపుట అని అర్థము.

దీనికీ కొంత నేర్పరితనం కావలయును. అయిదు నిమిషాల సేపు మనోహరంగా మాట్లాడడము కూడా అంత సులభమైన పని కాదు.

రైలులో ఎక్కి కూర్చున్న మనిషితో ప్లాట్‌ఫారం మీద నిలబడి వున్న మనిషి నాలుగు నిమిషాల సేపు మాట్లాడడము తెలియక ఎంత అవస్థ పడినాడో ఈ క్రింది సంభాషణ చూస్తే తెలుస్తుంది.

"అయితే నీవు యుకాయకీని నెల్లూరు వెడతా వన్న మాటేగా? ఒంగోలులో దిగవుగాదూ? సరే, ఏం జేసాం వెళ్ళు."

"వెళ్ళడంతోనే ఉత్తరం రాస్తావు కదూ!"

"ఒంగోలులో దిగవన్న మాటేనా?"

"సరే ఈ మధ్య ఎక్కడైనా కొంత ఫలహారం చెయ్యి."

"ఈ బండి నెల్లూరు వెళ్ళేసరికి మధ్యాహ్నాం రెండు గంట లవుతుంది. కాబట్టి ఎక్కడైనా కొంత ఫలహారం చెయ్యి."

"పోనీ ఒంగోలులో భోజనమే చేస్తే తీరిపోతుం దిగా అట్లా చెయ్యి."

"ఒంగోలులో దిగవన్నమాట. సరే."

"నెల్లూరులో రైలు చాలాసేపు ఆగుతుందిలే. తొందర పడనక్కర్లేదు. నింపాదిగా దిగవచ్చు."

"సరే. ఉంటా. ఇంతకూ ఒంగోలులో దిగకుండానే యుకాయకీని నెల్లూరు వెళ్ళి పోతా నన్న మాట!"

ఇదీ వరుస. సంభాషణ సాగించే తెలివి తేటలు లేకపోతే మాటలు దొరకక ఇట్లాగే కుంటి నడకలు నడుస్తుంది. ప్రసంగ కుశలుడు కాకపోతే ఇంతే.

సంభాషణలో కూడా రచనలో వలెనే సుశబ్ద ప్రయోగము చేయడము నేర్చి ఉండాలి. మనిషి పండితుడు అయిందీ, పామరుడు అయిందీ, సంస్కారము కలవాడు అయిందీ, సంస్కార హీనుడు అయినదీ తెలిసేది ఈ పద ప్రయోగమే.

విద్యార్థులు ముఖ్యంగా గమనింపదగిన విషయము ఇది. పెద్దల వ్యవహారములో మాత్రము ప్రసిద్ధమయిన అర్థముగల శబ్దములనూ చక్కటి సంస్కారము పొందిన శబ్దములనూ వాడుట వలన సంభాషణకు అపకర్ష వస్తుంది.

నేటి విద్యార్థుల సంభాషణలలో అశ్లీల పద ప్రయోగము బహుళంగా ఉన్నది. వారు అమంగళకరమూ, వ్రీడాకరము, జుగుప్సా ప్రతీతికరమూ అయిన శబ్దాలను తరుచుగా వాడి వినేవాడికి ఏవగింపులు కలుగ చేస్తున్నారు.

అట్లాగ బూతులు మాట్లాడడము వలన సంభాషణకు స్థిరత్వమూ, గట్టితనమూ వస్తుందని వారు అనుకొంటారు.

ఎవరి మీందో తమకు గల తిరస్కార భావాన్ని వెల్లడించడానికి, క్రోధమూ, కోపమూ, రోషమూ మొదలైన మనో వికారాలను ప్రదర్శించేటప్పుడూ, తమ శక్తి సామర్థ్యాలనూ, పౌరుషమునూ, ప్రతాపమునూ, ధైర్యశౌర్యాది గుణములూ ఇతరులు గ్రహించవలయునని కోరిక కలిగినపుడూ ఇట్లాంటి హీన శబ్దములను ప్రయోగించి మన జాతికే అపకీర్తిని తీసుకు వస్తున్నారు.

ఆంధ్రజాతి అశ్లీల ప్రయోగాలను, అమంగళకరమైన శబ్ద ప్రయోగమును సహించదు. మనము బియ్యం అయిపోయినవి అంటే అమంగళ ప్రతీతి కలుగుతుందని, నిండుకున్నవి అంటాము. దీపం పెద్దదైనది అంటాము. లేక కొండెక్కింది అంటాము. అమంగళవారాన్ని మంగళ వారము అంటాము. అటువంటి సంస్కృతీ సంప్రదాయమూ గల జాతికి చెందిన వారు. సంభాషణలో, బూతులు వాడడము ఎంత శోచనీయమో తెలిసికోలేకుండా ఉన్నారు విద్యార్థులు.

ఇక లోకాభి రామాయణం సంగతికి వద్దాము.

ఈ లోకాభి రామాయణము అనేది ఒక దారిని పడదు. ఒక విషయాన్ని అంటి పెట్టుకొని ఉండదు. అది వక్రగామి. కప్పగంతులు వేస్తుంది. అదీ దాని స్వభావము.

అయినప్పటికీ అందులో చిత్ర విచిత్రమైన పోకడలు పోవచ్చును. వినేవాడి మనస్సును రంజింప జేయవచ్చును.

మధుర భాషణతోనే సరస్వతి చరణ మంజీర రవములు సహృదయ హృదయములను స్పందింపజేసేలాగున చేయవచ్చు.

ఈ రకము సంభాషణ అవతల వానిని మనకు సుముఖులుగా చేయగల సామర్థ్యమును కలిగి ఉంటుంది. మనలో ఉన్న మంచిని ఇతరులు గ్రహించ డానికీ తోడ్పడుతుంది.

ఒకనిలో ఉండే సుగుణ సంపత్తి, విద్యా సంపత్తి, వినయము, ప్రియ భాషిత్వము, మృదుత్వము, మాధుర్యము ఇవన్నీ కూడా ఇట్లాంటి ఇష్ట గోష్ఠిలోనే బహిర్గతము అవుతూ ఉంటవి.

కాబట్టి మనము ఎవరి దగ్గరకైనా కాసేపు కబుర్లు చెప్పుకొంటానికి వెళ్ళినప్పుడు ఇష్టం వచ్చిన విషయమును గూర్చి మాట్లాడవచ్చును గాని, ఇష్టం వచ్చిన రీతిని మాట్లాడకూడదు. ఈ విషయంలో ఔచిత్యం పాటించకపోతే మనమే హాస్యాస్పదులము అవుతాము.

లోకాభి రామాయణం మాట్లాడుకొంటానికి ఇద్దరు వ్యక్తులు చేరినప్పుడు అక్కడ సంభాషణ యొక్క ప్రధానోద్దేశము కులాసాగా కాలం పుచ్చడం కాబట్టి, ఆ చేరిన ఇద్దరు వ్యక్తులూ కూడా ఒకరి నొకరు సంతోష పెట్టడానికి ప్రయత్నం చెయ్యవలెను.

అట్టి సమయాలలో ఇరువురు తమ తమ కష్ట సుఖాలు చెప్పుకుంటూ ఉన్నప్పుడు ఒకరి యెడల ఒకరికి సానుభూతి ఉండవలె. ఒకరు చెప్పే విషయాన్ని మరొకరు సావధానంగా వినే ఓర్పు ఉండవలె.

అసలు ప్రసంగ కౌశల్యము అంటే విస్తారము మాట్లాడడము కానే కాదు. ఎదుటి వ్యక్తి చెప్పేది మౌనముతోనూ, ఓపికతోనూ వినడమూ, మధ్య మధ్య సానుభూతి సూచకంగా ఒక నిట్టూర్పు విడవడమూ లేక ఉచిత రీతిని శిరఃకంపనము చేసి, చిరునవ్వు నవ్వి, అతడు చెప్పిన విషయమునకు తన సమ్మతిని తెలియజేయడమూ ప్రసంగ కుశలతకు లక్షణాలుగా గ్రహించవలయును.

సంభాషణ జరిగేటప్పుడు మాట్లాడే వ్యక్తి తనను గురించి చెప్పుకొంటే స్వోత్కర్ష అవుతుంది. ఎవరో వ్యక్తిని గురించి మాట్లాడితే వాగుడు అవుతుంది. తన మాటలు వింటూ ఉన్న వ్యక్తిని గురించి ప్రీతి వాక్యాలు పలికితే అది ప్రసంగ నైపుణ్యము అవుతుంది.

(మిగతా 68 వ పేజీలో)

# సముద్రస్నానం

మునిమాణిక్యం నరసింహారావు, బి.ఏ., ఎల్. టి.,



"చూడండీ."

"........"

"నిమ్మళ్ళే......"

"ఊఁ—ఎందుకూ, రేపు నాకు బడిలేదు... లేపకు... నిద్రపోని."

"మాట;—ఇల్లా చూడండి... రేపు మీరు కార్తిక సోమవారం ఉంటారా?"

"సోమవారం ఉండటమా! ఎక్కడ?"

ఎక్కడేమిటి—ఇంకా మీకు తెలుసునా లేదూ! కార్తిక సోమవారం ఉపవాసం ఉంటారా?"

"ఉండను."

"పోనీయండి, నేను సముద్రస్నానానికి వెళ్లి వస్తాను. ......కాస్త పిల్లలను చూస్తుండండి. ఇక్కడున్నట్లుగా వస్తాను."

"వద్దు..."

"అల్లాగంటే ఎల్లాగండీ...మహా పర్వదినం...ఇట్టే వస్తానుగా! తెల్లవారేటప్పటికి వస్తాను. పెద్దపిల్లను తీసుకొనే పోతాను. చిన్నవాళ్లను కాస్త చూస్తుండండి."

తరువాత నిద్రమత్తులో ఏమన్నానో జ్ఞాపకంలేదు. ఆమె బండెక్కి వెళ్లటం నేను తలుపు వేసుకొని మళ్లీ వచ్చి పడుకోటం నాకు జ్ఞాపకమే.

కొంతం ఇల్లు దాటిన పావుగంటకల్లా పసిది లేచి తల్లి పక్కలో లేకపోవటం మూలాన కెవ్వున కేకేసి "అమ్మా" అని పిలిచింది. నేను లేవక తప్పింది కాదు. ముక్కుకుంటూ, మూల్గుకుంటూ వెళ్లి "అమ్మా లేచావు తల్లీ, పడుకో" అన్నాను. నా మాటలు దానికి అర్థం అయితే గదా! అది అట్లాగే మేకులాగ కూర్చున్నది నడి సుంచంమీద "అమ్మ," "అమ్మ" అంటూ.

కాసేపు నాలుగువైపులా చూచి, అమ్మ లేకపోవటం మూలాన మెల్లగా లేచి మేడ దిగటానికి పోతున్నది.

మెట్లు పసిది దిగలేదు. అందుకని దాని ఉద్దేశాన్ని గ్రహించి ఎత్తుకొని మేడక్రిందికి దింపాను. అది సుంగు వంట ఇంట్లోకి వెళ్లింది "అమ్మా" అని ఏడుస్తూ. అక్కడ ఎవ్వరూ కనపడలేదు. తరువాత దొడ్డి తలుపు దగ్గర నుంచుని ఏడ్చింది. తలుపు తీశాను. దొడ్లోకి వెళ్లింది. ఆ మసక మసక చీకట్లోనే, దొడ్డంతా వెతికింది. ఎక్కడా అమ్మ కనపడలేదు.

ఇక అమ్మ ఇంట్లో లేదన్న విషయాన్ని గ్రహించి అది నన్నే నమ్ముకొని నేను చెప్పినట్లు వింటుందని నా నమ్మకం. అందుకని దాన్ని ఎత్తుకొని మళ్లీ మేడపైకి వచ్చాను. అది ఏడ్పు ఏమాత్రం ఆపలేదు. పెద్దగా ఏడ్వటం సాగించింది.

అమ్మ ఇంట్లో లేదని పూర్తిగా గ్రహించి కూడా అది అట్లా పెంకెతనంగా ఏడ్వటం నాకు ఏమీ సమంజసంగా కనపడలేదు. తరువాత స్పష్టంగా చెప్పి చూద్దాము నాతప్పు లేకుండానని,

"తల్లీ ఇదిగో చూడు...మీ అమ్మ ఇట్లా సముద్రానికి పోయింది. ఒక గంటలో వస్తుంది. అందాకా నేను ఎత్తుకుంటాను. నీవు ఊరుకో- ఏడిస్తే లాభంలేదు" అని స్పష్టంగా చెప్పాను.

దాని కాసంగతి బోధపడలేదనా? కాదు. చక్కగా బోధపడ్డది. "అమ్మ—ఓ పోయి" అన్నది.

"ఆ......అదీ సంగతి, నీవు ఏడ్వవద్దు. కావలిస్తే బిస్కట్లు పెడతాను"—అన్నాను.

మరి ఇక ఊరుకోవలసిందేనా, న్యాయంగా? ఊరుకోదే? ఒకటే ఏడ్వటం.




పైగా ఎత్తుకున్నా నిలవక పోవటం, ఎగిరిపడటం, బుజంమీద పడుకోబెట్టుకొని చిచ్చి గొట్టినా జారి పోవటానికి ప్రయత్నంచేయటం, ఇదీ దాని ప్రవర్తన.

చెయ్యి గట్టిగా అదిమిపెట్టి బుజంమీద పడుకోబెట్టాను. కాని, అది చెయ్యి తీసేసి కెవ్వున కేకేసి తాచుపాములాగ చివ్వున లేచి "అమ్మా" అంటూ ఏడుస్తుంది.

"ఎట్లాగా నీతో, న్యాయంలేకుండా ప్రవర్తిస్తావు? అమ్మాయీ, కోపం వస్తోంది! కొడతాను" అని చెయ్యి ఎత్తి చూపి భయపెట్టాను. ఇంకా ఎక్కువైంది ఏడ్పు.

"పిల్లలైతే మట్టుకు గ్రహింపు ఉండొద్దూ" అనుకొని విసుక్కొని, ఏడిస్తే ఏడ్వనీ—నా తప్పులేదు అనుకొని అట్లాగే దాన్ని బుజంమీద పడుకోబెట్టుకున్నాను.

ఇంతలో "అమ్మా" అంటూ లేచాడు చిన్నవాడు. వీడు దానికంటె పెద్దవాడు. నాలుగో ఏడు. మాటలు అర్థం అవుతాయి.

"నాయనా పడుకో" అన్నాను.

"అమ్మేదీ" అన్నాడు.

"అమ్మ సముద్రస్నానానికి వెళ్లింది. ఇంకాసేపట్లో వస్తుంది. పడుకో నాన్నా, ఇంకా తెల్లవారలేదు. నిద్ర పో."

"నేను పడుకోను, నిద్ర రాదు."

"పోనీ....ఆడుకో...అ...దిగో ఆ పుస్తకంలో బొమ్మలు చూసుకో."

"వద్దు."

"పోనీ గంట కొయ్యి."

"ఊహూం."

"మరి ఏం జేస్తావు?"

"అమ్మ పోతా."

"ఓరి వెధవా—అమ్మ సముద్రానికి వెళ్ళింది. సముద్రం ఇక్కడికి నాలుగు మైళ్లుంది. నీవు నడవలేవు. నీకేమైనా మతి పోయిందా? అమ్మ ఇంకాసేపటికల్లా వస్తుంది ఉండు" అన్నాను.

"రాను..." అన్నాడు నిస్సందేహంగా.

అన్నవాడు ఊరుకోక మేడమెట్లు దిగి సముద్రానికి పోతానంటూ ప్రయాణం గట్టాడు. ఈచీకట్లో ఏమిటి? సముద్రానికి నాలుగేండ్ల వెధవ వెళ్లటం ఏమిటి? వీళ్లకు తెలివి ఎందుకుండదో అనిపించింది.

గబగబ మెట్లు దిగి పోతున్నాడు వెధవ? ఏమిటి వీడి సాహసం!

"ఒరేయ్" అంటూ వాడ్ని దగ్గరకు తీసుకున్నాను. చిన్నదాని కంటే చెప్పినా అర్థం కాలేదు. వీడికన్నా చెప్పితే వింటాడని,

"నాయనా, ఒరే.....ఏడ్వకూ...ఎందుకూ......ఏడుపు?"

"అమ్మ......"

"సరే...అమ్మకోసం ఏడుస్తున్నావు...అమ్మ సముద్రస్నానానికై వెళ్లింది; వస్తుంది. ఏడ్వటం ఎందుకూ?" అన్నాను సహేతుకంగా నచ్చచెప్పాలన్న ఆశతో.

వాడు మళ్లీ "అమ్మ" అన్నాడు.

"వస్తుంది కాసేపట్లో" అన్నాను.

"రాదు......" అన్నాడు బిక్క మొఖంతో.

"వస్తుందిరా నాయినా, తెల్లవారేటప్పటికి వస్తుంది."

రాదు......అని ఒకటే ఏడ్వటం అమ్మ వస్తుంది అని ఎంత నచ్చ చెప్పినా వినడు. అమ్మ రాదు అని వాడికి గట్టి నమ్మకంతో అంటాడు.

"వస్తుందిరా నాయినా, ఈ పోవటం పోవటం ఇక రాకుండా పోతుందని రా నీ ఉద్దేశం."

"అట్లా ఎప్పటికీ పోదు. పిల్లలనూ, నన్ను వదలిపెట్టి లేచిపోయే మనిషి కానేకాదు మీ అమ్మ. నాకు బాగా తెలుసు. ఆమాట అనుకోటమే తప్పు. నామాట నమ్ము. తప్పక వస్తుంది," అని ఎన్నివిధాల నమ్మకం చెప్పినా వాడికి వీసమంతయినా నమ్మకం కలగదు.

"అబ్బబ్బ...చంపుతున్నావురా నాయినా; తప్పక వస్తుందిరా మీ అమ్మ" అని పెద్దగా అరిచాను కోపంతో. ఊఁహు... ఏమాత్రం నమ్మకంలేదు వాడి వదు...అమ్మ రాదు—అని వాడు మళ్లీ అనడం ఏడ్వటం.

మహాప్రభూ——ఎట్లా వీడ్ని నమ్మించడం! వాళ్లమ్మ ఇక రాదనే వాడి గట్టి నమ్మకం!

పోనీ ఏదో అలాగే ఏడుస్తూ ఉన్నా ఒక సుగుణమే. కాళ్లొచ్చిన వెధవ, వీడైతే మేడదిగి సముద్రానికి పోతా నంటూ బయలుదేరుతున్నాడు మాటిమాటికీ! చిన్నది ఎత్తుకున్నా ఏడ్వటం మానలేదు. అందుకని దాన్ని దింపేసి, వీడిదగ్గర చేరి ఎట్లాగయినా సమదాయిద్దామని కూర్చున్నాను.

చిన్నది నా పడకగదిలోకి వెళ్లింది. అక్కడ చూసింది. ఇంకో గదిలోకి వెళ్లింది. అక్కడ చూసింది. అమ్మకోసమూ ఈ వెతకడం! వాళ్లమ్మను నేను దాచేశానని కాబోలు దీని నమ్మకం.

చిన్న గదిలో సుశీ పడుకొని ఉన్నది వాళ్లమ్మచీర కప్పుకొని. చిన్నది ఆ చీర గుర్తుపట్టి అదే అమ్మ అనుకొని వెళ్లి అమాంతం దానిమీద పడ్డది. కెవ్వున కేకేసి "అమ్మా" అంటూ లేచింది సుశీకూడా.

కాస్త పెద్ద పిల్లగదా అని దాంతో "అమ్మా సుశీ, పసిదాన్ని కాస్త పట్టుకొని సమదాయించు. అది అమ్మ కోసం ఏడుస్తున్నది," అన్నాను.

"అమ్మ ఎక్కడికి వెళ్లింది?" అన్నది సుశీ.

"సముద్రానికి స్నానానికి..." అన్నాను నేను.

"నన్నుతీసుకెళ్లలేదేం?" అని ఒక్క పెట్టున ఏడ్చింది.

"ఓసి భడవా? నీవు కూడా ఏడిస్తే ఎట్లాగే? వీళ్ళతోనే సతమతం అవుతుంటేను! వళ్లు పగల గొడతా ఏడిస్తివా అంటే!" అని భయ పెట్టాను. ఇది మట్టుకు భయపడి ఊరుకుంది.

పసిదిమాత్రం వెక్కి వెక్కి ఏడ్వటం మానలేదు. చిన్నవాడు ఒకే స్థాయిలో అమ్మ రాదనే నమ్మకంతో ఏడుస్తున్నాడు. అమ్మ వస్తుంది ఉండరా అని నేనూ, రాదని వాడూ వాదన.

తల బద్దలు చేసుకొందామన్నంత విసుకు పుట్టింది. ఈ లోపున సుశీ మెల్లగా వెళ్లి నిద్రపోతున్న తమ్ముడ్ని లేపింది. అమ్మ వెళ్లిపోయిందని చెప్పేసింది.

వాడో ఏడుపు ఏడ్చాడు. వాడ్ని భయపెడితే బిక్క ముఖం వేశాడు.

"నాయినా, మొగ పిల్లలు ఏడ్వకూడదు"దని అప్పీలు చేశాను. ఎట్లాగయితేనేం ఏడుపు దిగమింగి మొగతనాన్ని నిలబెట్టాడు మా వాడు.

వాళ్ల యిద్దర్ని ఎట్లాగో ఆపానుగాని పసివాళ్లనే ఊరుకో బెట్టడం నాతరం గాలేదు. ఎట్లా సమదాయించాలో, ఏం చెయ్యాలో, నాకు తెలిసింది కాదు. సామ దాన దండోపాయాలవల్ల ఏమీ ప్రయోజనం కనుపించలేదు.

ఇద్దరికి బిస్కట్లు పెట్టాను. ఇద్దరు విసిరి పారేశారు. కర్జూరపండు ఇచ్చాను. నా ముఖాన కొట్టారు. ఆట వస్తువులు చూపాను. కాళ్లతో తన్నేశారు. వాళ్లమ్మ ఫోటో చూపి, "అదిగో అమ్మ" అన్నాను.

అయినా ఏడ్పు మానలేదు పసిది. వాడు మాత్రం, ఆ బొమ్మ అమ్మ కాదన్నాడు. అమ్మేరా, అని నేనూ, కాదని వాడూ. మళ్లీ మొండి వాదన.

చిన్నదానికి ఏమీ తెలియక ఏడ్పు. వాడు మొండితనాన ఏడ్పు. వాళ్లమ్మ ఫోటోకూడా 'కాదని' వాదిస్తుంటే ఏం జెయ్యాలె వెధవని? ఇక వాడితో వాదన లాభం లేదు, రెండు తగిలిస్తేనేగాని ఊరుకోడనుకొని, వీపు పైని చెళ్లున వేశాను నోరు మూయమని. వాడు కెవ్వున కేక పెట్టి, పెద్ద గుక్కపట్టి ఏడుస్తూ మేడ మెట్లు దిగాడు.

వెధవ, చీకట్లో భయపడతాడని పసిదాన్ని దింపి వాడి వెంటబడి గిలగిల కొట్టుకుంటూన్న వాడ్ని పట్టుకొస్తున్నాను.

ఈ లోపున పసిది మేడమెట్లు రెండు దిగి దొర్లటానికి సిద్ధమైంది. మహాప్రభో వీళ్లమ్మ ఎట్లా వేగుతున్నదో రోజూ వీళ్లతో ననిపించింది.

పసిదాన్ని, వాడ్ని, ఎట్లాగయితే నేం లాక్కొచ్చి మంచంమీద కూలేసి, సమదాయించటానికి ఏ మాత్రం ప్రయత్నం చేయక చూస్తూ ఊరుకొన్నాను, శత్రు సేనలు కోట తలుపులు బద్దలు కొట్టుకొని వస్తూంటే, ఏమి చేయలేక నిలబడిపోయిన రాజులాగ.

ఇంతలో అరుణోదయం అయింది. చీకట్లు పోతున్నయి. ఈపాటికి ఆవిడ వస్తూ ఉంటుందన్న ధైర్యంతో—అమ్మాయీ, సుశీ, మీ అమ్మ వస్తున్నదేమో చూడూ వాకిట్లో కెళ్లి అన్నాను.

ఏదీ?—సుశీ లేదు! దాని తమ్ముడూ లేడు! ఎక్కడికో వెళ్లిపోయినారు. గుండె గుభేలు మన్నది, వీళ్లెక్కడికి వెళ్లారోనని.

నేను ఈ పసి పిల్లలతో అవస పడుతుంటే వాళ్ళిద్దరు ఎప్పుడో జారారు. వీథ తలుపు తీసి ఉంది. వీథిలో కెళ్ళి చూచాను. పెద్దగా కేకవేశాను. ఎక్కడ జాడ లేరు. వీళ్లెక్కడి కెళ్లారో, ఎంతదూరం పోయినారో

అని దిగులేసింది. ఆ పిల్ల చేతులకు బంగారపు గాజు లున్నాయి. అవి కాస్తా కాజేస్తారేమో ఎవరన్నా? లేకపోతే వాని కాశపడి పిల్లదాన్ని ఎవ రేం జేస్తారో!




ఎక్కడ వీళ్ళిద్దరు మారు పడతారో? అని గుండెల్లో గుండెలు లేవు. పోని వాళ్లకోసం వెతుకుదామంటే వీళ్ళిద్దరిని వదలి ఎల్లాగ కదలటం!

ఇంతలో పసిముండ ఏడ్చి ఏడ్చి అలసిపోయి ఏడ్వ లేక సొమ్మసిల్లింది. దీని కెక్కడ నోరెండి పోయిందో నని, బుజాలమీది దాన్ని బుజాలమీదే ఉంచుకొని, పాల

డబ్బా తీసి కొంచెం పాలు కలిపి, "అమ్మా తాగ"మని ఇచ్చాను. గ్లాసు పుచ్చుకొని గుక్కెడు కామోలు తాగి చూస్తుండగానే ఆ గ్లాసు విసిరి నా మీద కొట్టింది.



బట్టంతా తడిసింది. మొఖం నిండా పాల చుక్కలు. జుట్టునిండా పాల చుక్కలు.

"ఛీ—దీని దుంప తెగ......అవస్థ"......అని విసుక్కొని ఇటుచూద్దునుగదా, ఆ చిన్న వెధవ పండు దొరికిందిగదా అని, సముద్రానికి ప్రయాణం గట్టి వాకిట్లోకి పోయినాడు. అప్పుడు తెలతెల వారుతుంది.

వీడుకూడా ఎక్కడికి వెళుతాడో మరీ చిన్న వెధవ అని "ఒరే వెధవా, నీవుకూడా వెళ్ళిపోతావా ఏమిట్రా" అని పరుగెత్తుకొని వెళ్ళాను వాడ్ని పట్టుకొందామని. నాకు చిక్కకుండా పారిపోవాలనే ప్రయత్నంలో వాడు పరుగెత్తి కాలు జారి సైడుకాల్వలో పడ్డాడు. తకీమని దిగాను, మోకాలు లోతు మురుగు నీళ్ళలోకి. పిల్లవాడి నోట్లోకి మురికి నీళ్లు పోతాయేమోనని, వాడ్ని చప్పున ఎత్తుకొని చంక వేసుకొన్నాను. వాడి మొఖం, వళ్ళూ, అంతా బురద. నా బట్టలన్నీ బురద. వాడు ఏడుస్తూ నన్ను కావిలించుకొని నా మొఖంనిండా ఆ దుర్గంధ ద్రవ్యం పూశాడు.

ఇంతలోకే చిన్నదికూడా అడుగు లేస్తున్నది ఆవేశే. ఇదికూడా వెళ్ళి ఎక్కడ పడుతుందోనని దాన్నికూడా ఇంకో చంకలో కెత్తుకున్నాను.

అప్పుడు చూడాలి నన్ను, బిడ్డలు చెరో చంకనా ఉన్నారు. మొఖంనిండా సైడు కాల్వలోని బురద—మోకాలుదాకా కూడా దట్టంగా ఉంది ఆ బురద సాక్సు తొడుక్కున్నట్లుగా. తలపైన పాలచుక్కలు.

ఈ స్థితిలో నేనుండగానే వాకిట్లో బండి ఆగటం ఆవిడ దిగటం తటస్థించింది.

నన్ను ఆ స్థిలో చూచి నేను పడ్డ పాట్లన్నీ గ్రహించి, కొంతం, నాపై జాలిపడి నాయందు సానుభూతి చూప, తాను సుఖంగా సముద్ర స్నానం చెయ్యటానికి వీలు కల్పించేందుకోసం, ఇంత అవస్థ నేను పడ్డందుకు నా యందు ఎంతో కృతజ్ఞత కలిగి, నన్ను ఎంతో Thank చేస్తుందన్న ఆశతో అక్కడే నిలబడ్డాను.

వచ్చింది అమ్మగారు నిప్పులు గక్కుతూ "ఇద్దరు పిల్లలనూ, వదిలేశారేం? వంతెనమీద కూర్చుని ఏడుస్తున్నారు" అంటూ.

నేనేం మాట్లాడలేదు. చూడు నా అవస్థ—అన్నట్లు అక్కడే నుంచున్నాను.

చూచింది...ఒక్క నిమిషం. గ్రహించింది నా అవస్థ. ......కొంచెం విచారం కళ్ళల్లో......మళ్ళీ చిరునవ్వు ......అంతే!

పసిడి తాచులాగ జారిపోయింది తల్లి దగ్గరకు. పసివాడు పోయి కౌగిలించుకొన్నాడు.

కాంతం కూర్చుని పిల్ల దానికి పాలిస్తూ "అమ్మా నా తల్లే, ఎంత ఏడ్చిందో! వెక్కి వెక్కి ఏడ్చిందా? నోరెండిపోయిందా?......రా నాన్న......మా తండ్రి ......చచ్చిపోయినారా......నాన్న......నిన్ను వదిలేసి వెళ్లాను......ప్రాణాలన్నీ మీమీదే ఉన్నాయి. ఎంత ఏడ్చావురా? ఈ మురికంతా ఏమిట్రా నాయనా? పడ్డావా? నా తండ్రే. పిల్లలను ఏడ్పించాను" అని మాటమీద మాట అంటూ దాన్ని ముద్దెట్టుకోనూ, వీడ్ని ముద్దెట్టుకోనూ, దాన్ని పలకరించనూ, వీడ్ని పలకరించనూ, తన్నుతాను నిందించుకోనూ ఎంతసేపూ ఇదే వరస!

ఈ మానవుడు పడ్డ కష్టానికి ఒక్క సానుభూతి వాక్యం......కృతజ్ఞతను సూచించు ఒక్క చూపు... ఒక్క మంచిమాట లేదు!

పిల్లలకు తల్లే లోకమైంది! తల్లి ప్రేమంతా పిల్లకే ఇచ్చింది—ఇక నాకు స్థానం ఏదీ!

అల్లాగ సూర్యుని కెదురుగా నిలబడిపోయేను వెర్రి చూపులు చూస్తూ,